*ఈ గ్రంథంలో విషయసూచిక*

*ఇవ్వకపోవటానికి కారణం ప్రతి విషయమూ*

*మీరు తెలుసుకోవాలనీ, నిదానంగా అయినా*

*మొత్తం చదవాలనే సదుద్దేశంతో ఈ*

*ప్రయత్నం చేస్తున్నాము.*





# మహర్ధశ

## వినాయకుడికి ప్రతి రోజు పెట్టే నమస్కారం

■ ప్రతిరోజూ.. మీ పిల్లల చేత వినాయకుడికి ఒక నమస్కారం పెట్టించే అలవాటు చేయండి. మీరూ వారానికి ఒక్కసారి నవగ్రహ ప్రదక్షిణలు మెల్లగా చేయండి. విద్యలో వారు, గృహంలో మీరు రాజుగా విలసిల్లుతుంటారు. నవగ్రహ ప్రదక్షిణలు అయ్యాక అరటిపండ్లను దానం చేయండి.

## నవగ్రహాలని దర్శించి...

■ ఆపై మహాశివుడి దర్శనానికి వెళ్ళాలి. నవగ్రహ ప్రదక్షిణలు అయ్యాక కాళ్ళు కడుక్కొని ఈశ్వరుణ్ణి దర్శించుకోవాలి. అదే శ్రీరాముని ఆలయంలో శ్రీరాముణ్ణి దర్శించి ఆపై ఆంజనేయస్వామి ఆలయం వుంటే అక్కడికి వెళ్ళి హనుమను దర్శించుకోవాలి.

## లక్ష్మీదేవికి ప్రియమైన మాసం...

## శనీశ్వరుని శుభవీక్షణల మాసం

■ శ్రీ లక్ష్మీదేవికి శ్రావణమాసం ఇష్టమే. కానీ పదహారు దివ్యగుణాలతో, పదహార తామరపూలను ధరించిన శ్రీలక్ష్మీ దేవికి అందిరిలాగానే పుట్టినరోజూ, పెళ్ళిరోజు జరిగిన మాసం అంటేనే ప్రీతి.

ఆమె జన్మించిన మరియు ఆమెకి వివాహం జరిగిన మాసం ఫాల్గుణ మాసం. ఆ మాసంలో ఆ తల్లిని పూజిస్తే ఛాయ సుతుడు అనగా శనీశ్వరుడు తనని నిత్యం స్మరించిన రాముని సతిని పూజించినందుకు శుభవీక్షణలనిస్తాడు.

## సంతానం కలుగకపోతే

■ నాగ దోషం వుంటే సంతానం మహా ఆలస్యం అవుతుంది. అలాంటివారు పుత్రకామేష్ఠి యాగం చేయాలి. ఆపై ఉల్లి, వెల్లుల్లి మానివేసి ఆరునెలల పాటు గరుడస్తోత్రం చేయాలి. అప్పుడు తప్పకుండా సంతానం కలుగుతుంది.

## వీణ తీగని చూసి నేర్చుకోవాలి

■ వీణ తీగని గట్టిగా లాగితే తెగిపోతుంది. వదులుగా కడితే సంగీతం పలికించలేదు. అలాగే మనిషి అతి ఆవేశాలకీ, అతి మంచితనానికీ పోకుండా వీణతీగలా వుండాలి. అప్పుడే తనకీ, తన వారికీ అపూర్వమైన ఆనందాన్ని ఇవ్వగలడు.

## సంధ్యా వందనం చేయటమంటే

■ రాక్షసులని సంహరించటమే. దేవతలకి శక్తిని ఇవ్వటమే. సంధ్యా వందన విధిలో దేవతల మీదకు యుద్ధానికి వెళ్ళిన రాక్షసుల ఆయుధాలూ, రథాలు నుగ్గు నుగ్గు అవుతాయి. ఆ శక్తి దేవతలకి కలుగుతుంది. తద్వారా దేవతలు సంతోషించి లోకానికీ, సంధ్యా వందనం చేస్తున్న వారికీ శ్రేయస్సును కలిగిస్తారు.





## అవకాశం చేజారిపోతుంటే

■ నమ్మి మోస పోయిన ధనం తిరిగి రావాలన్నా, అవకాశము వచ్చినట్టే వచ్చి చేజారి పోతున్నా సూర్య మంగళాష్టకమును ఏడు ఆదివారాలు పఠించండి. గోరు మాలను విప్రులకి దానం ఇవ్వండి.

## ధనాన్ని గృహంలో నిద్ర చేయించాలి

■ మీకు రావాల్సిన ధనం చేతికొచ్చిన రోజు ముందుగా గృహానికి తీసుకెళ్ళాలి. ఒక్క నిద్ర చేయించాలి. రెండో నిద్ర అయితే మూడో నిద్ర ఖచ్చితంగా చేయించాలి. లేదా ఆ మరుసటి రోజు అందించాల్సిన వారికి అందించాలి. అందుకే పూర్వీకులు దేవాలయాల్లో గానీ, తీర్థ ప్రదేశాల్లో గాని ఒకటి లేదా మూడు నిద్రలు చేయాలని చెబుతారు. గృహంలో ధనాన్ని మూడు నిద్రలు చేయిస్తే శాశ్వత బంధం ఏర్పడుతుంది. అందుకే వివాహ కార్యక్రమంలో కూడా దంపతుల చేత మూడు నిద్రలు చేయించేది.

ఇంకా రావాల్సిన ధనం విషయంలో వాయుదేవుడిలా వెళ్ళి తీసుకోవాలి. ఇచ్చేటప్పుడు శనీశ్వరునిలా అడుగులో అడుగేసుకుంటూ అనగా ఆలోచించి ఆలోచించి ఇవ్వాలి. గృహంలో ధనం నిలువ ఉండాలంటే సోమవారం రోజున చంద్రుని ధ్యానస్తోత్రం చేసి దద్ధ్యోజనం నివేదించి పంచాలి.

**చంద్రగ్రహ వీక్షణ సరైన రీతిలో లేకపోతే మహా భీకర విపత్కర స్థితులు కలుగుతాయి. చంద్రుడు ఓషధులకి అధిపతి. అహం, ఆత్మస్థైర్యం హద్దులు దాటడం... ఈ లక్షణాలు చంద్రగ్రహ అశుభ దృష్టి ఉన్నందువల్లనే.**

**- బృహత్కథ**

## అక్కడే లెక్క పెట్టుకోండి

■ ధనం తీసుకునేటప్పుడు కొంతమంది అవతల వాళ్ళు ఇచ్చింది తీసుకుని వచ్చేస్తుంటారు. దాని వల్ల చాలా నష్టం. మీ మనస్తత్వం తెలిసి ఇచ్చేవాళ్ళు తక్కువ ఇస్తారు. అలా మీరు చాలా నష్టపోతుంటారు. ఇంటికొచ్చాక లెక్క వేసుకున్నా చెయ్యగలిగింది ఏమీ లేదు. అడిగితే లేనిపోని కోపాలు. ఒక్కోసారి పెద్ద పెద్ద ఎమౌంట్స్‌లో ఇవ్వాల్సిందాని కన్నా వందో, రెండొందలో ఇస్తారు. ఆహా రెండు వందలు ఎక్కువ వచ్చాయని ఆనందిస్తే అవతల వాళ్ళు మరోసారి వెయ్యో, రెండువేలో తక్కువిస్తారు. మీరు అడిగితే వచ్చే సమాధానం "ఏం గతంలో రెండు వందలు ఎక్కువిస్తే దో....లా!" అని. కాన లెక్క చాలా అవసరం. రోజు వారీలు కట్టే వాళ్ళు లెక్కలు చూసుకోండి. ఒకటి, రెండు తేడా పడే వుంటాయి.

## ఆశే ధనాన్ని పోగొడుతుంది

■ బత్తాయిలు బేరమాడాడు. చివరగా డజను పద్దెనిమిది రూపాయిలకి కుదిరింది. మూడు డజన్లు ఇమ్మన్నాడు. అపై వెంటనే జేబులోంచి యాభై కాగితం తీసి మూడు పద్దె నిమిదులు నలభై నాలుగు... యాభై కాగితం ఇచ్చి మిగిలింది ఉంచుకో అన్నాడు. దాంతో బత్తాయిల వాడు తబ్బిబ్బయి పోయి ఆయాచితంగా వచ్చే ధనం కోసం ఆశపడి నష్ట పోయాడు. ఆ ఆనందంలో సరిగా లెక్క వేసుకోలేదు. ఆ తర్వాత తెలిసినా చెయ్యగలిగేది లేక గమ్మునుండిపోయాడు. కాన అవతల వారి సొమ్ము ఉచితంగా అసలు వద్దు. అది అసలుకే మోసం.





## స్త్రీ పురుషుల్లో ఎక్కువ సుఖమెవ్వరికి

■పూర్వము మగధను ఏలే ప్రతాపసింహుడు వేటకెళ్ళి ముని శాపానికి గురై స్త్రీగా మారాడు. మరోరాజు ఆమెను చూసి ముచ్చట పడ్డాడు. వివాహం చేసుకొని సంతానాన్ని కన్నాడు. ఆ తర్వాత ప్రతాపసింహుడి శాపం తీరే గడువు దగ్గర పడింది. దాంతో ఆతడు మునివద్దకెళ్ళి 'స్వామీ నా శాపాన్ని శాశ్వతం చెయ్యండి. రాజుగా ప్రతాపసింహునిగా ఎన్నో సుఖాలను అనుభవించాను.. కానీ స్త్రీగా మారిన తర్వాత సుఖాలకి నిర్వచనం తెలిసింది. స్త్రీగా ఎన్ని బాధ్యతలూ, బాధలూ వున్నా ఆ మహాసుఖం మరవలేనిది. నన్ను స్త్రీగానే వుంచండి. కానీ నా భర్తకి ధనానికి లోటు చేయకండి. ధనమున్న భర్తని పొందితే ఆ స్త్రీ సుఖం ముందు ఆ మహేంద్రుని ఇంద్రపదవి కూడా దిగదుడుపే" అంది.

## ఆలయాల్లో దర్శనము

■ శ్రీమహావిష్ణువు ఆలయంలో స్వామి ఎదురుగా వున్న తాబేలు పక్కన నిలిచి ధ్యానించాలి. ముందుగా స్వామి పాదాలను, ఆపై ఛాతి, ఆ తర్వాత స్వామి దివ్యమంగళ స్వరూపాన్ని అనగా కళ్ళను చూసి కనులు మూసుకొని మూర్తిని మనసులో నిలుపుకొని నమస్కరించాలి. అదే శివాలయం అయితే నంది పక్కన నిలబడి దర్శించుకోండి.

## అతి చల్లని, అతి వేడి పదార్థాలను నివేదిస్తే

■ 'ఓం వాం నమః పరాయ నివృత్యాత్మనే', 'ఓం రాం నమః పరాయ విశ్వాత్మనే' అని 108 సార్లు జపించాలి. అలాగే వండిన తర్వాత మూడు గంటలు దాటకుండా నివేదన చేయాలి.

## ఋణబాధలు కలిగించేది కుజుడు

■ ఆర్థిక రాబడి రావటానికి, ఋణబాధలు పోవటానికి రాగిపాత్ర నిండా కందులు పోసి దానం ఇవ్వాలి. అలాగే ఋణ విమోచన అంగారక స్తోత్రం లేదా సుందరకాండ పారాయణం చేయాలి.

## నీతి తప్పితే చంద్రగ్రహ దోషానికి గురికావాల్సిందే

■ తన స్వార్థం కోసం సాటి ప్రాణిని ఆపదల్లోకి నెట్టిన వాడ్ని చంద్రగ్రహం తన తీక్షణ చూపుతో మతి పోగొడుతుంది. తనలో తాను మాట్లాడుకోవటం, పిచ్చి పిచ్చిగా ప్రవర్తించటం ఇత్యాదివి చేస్తుంటారు. పూర్వము హిరణ్య గుప్తుడు ఆలానే చేసి రోగాల పాలయ్యాడు. చంద్ర గ్రహ శాంతి చేయిస్తే తిరిగి కోలుకుని కుదుటపడతారు.

## మనమాటల ద్వారానే లాభమైనా, నష్టమైనా

■ సరళంగా ప్రేమగా మాట్లాడటం ద్వారా.. అర్థం చేసుకుని మాట్లాడటం ద్వారా మంచి విషయలు మాట్లాడటం ద్వారా, లౌక్యంగా మాట్లాడటం ద్వారా, నిజాన్ని నిర్భయంగా మాట్లాడటం ద్వారా, తక్కువగా మనసు నొప్పించకుండా మాట్లాడటం ద్వారా, చిరునవ్వుతో మాట్లాడటం ద్వారా వయసుకి తగ్గ మాటలు మాట్లాడటం ద్వారా ధనమూ, సుఖాలు కలుగుతాయి. పైవాటికి భిన్నంగా మాట్లాడితే దుఃఖాలూ, సమస్యలు. వెరసి ధననష్టాలు అపారం. పెద్ద గిన్నెలో తేనెను నింపి తుమ్మెదల ముందు పెట్టినా అవి తీసుకోవు. ఎందుకంటే వాటికి తామెక్కడ వాలాలో... ఎప్పుడు శబ్దం చేయాలో తెలుసు.





## ఏ పనీ చెయ్యకుండా డబ్బులెలా సంపాదిస్తున్నారు

■ఓ నెలంతా పని చేస్తే అయిదువేలు .. లేదా పదివేల లోపు. అదే అయిదు వేలు అంటే ఓ వ్యక్తి నెలరోజులు పాటు కష్టపడి సంపాదించే ధనం కేవలం లక్ష వడ్డీకి ఇచ్చి అనగా ఆరురూపాయిల నుంచి పదిహేను రూపాయిల వరకూ వడ్డీకి ఇచ్చి సంపాదిస్తున్నారు. అవతల వాళ్ళ దగ్గర్నించి ఖాళీ చెక్కులు.. నోట్లు. తీసుకున్న వాడికి అప్పిచ్చిన వాడి సూటిపోటి మాటలతో పాటు చెక్కు, నోట్ల భయం. వెరసి.. జీవితమే భయం. తలవంచుకోవటం ప్రారంభం... అలాంటి విష వలయంలోకి వెళ్ళిపోతుంటారు. మన చుట్టూ వున్న సమాజంలో రాత్రికి రాత్రి పెళ్ళాం బిడ్డలతో పారిపోయాడనే వార్త మీరు విన్నప్పుడు పైది గుర్తుపెట్టుకోండి. చెప్పేవాళ్ళు లేక, లెక్క తెలీక... తన జీవితాన్ని, తనని నమ్ముకున్న వారి జీవితాన్ని నాశనం చేసుకుంటారు. కీర్తికన్నా ధనం గొప్పది. ఎందుకంటే మీరెంత గొప్ప వారైనా అవతల వాళ్ళు గౌరవించాల్సిన అవసరం లేదు. అదే మీరు వంద బాకీవుంటే లక్ష మందిలో కూడా మిమ్మల్ని వేలు పెట్టి చూపించి అడిగే ప్రబుద్ధులు వున్నారు. అడగటం తప్పని అనటం లేదు. అలాంటి వాళ్ళు అప్పటికే మీ దగ్గర వేలు తిని వుంటారు. ధనం విషయంలో జాగ్రత్త ఇవ్వడంలోనే కాదు తీసుకోవటంలో కూడా.

**ఏ గ్రహ దోషపరిహారములకైనా శక్తి వుంటే నవగ్రహ శాంతి.. నక్షత్ర జపము.. గ్రహ హోమశాంతులు.. మహామృత్యుంజయ జపము చేయించుట శుభకరం.**

## ఆవుపాలు అమృతమయం ఎందుకు అవుతాయి

■ గోవు మూపురం కింద వున్న వెన్నుపూసలో సూర్యశక్తిని తీసుకునే మహత్తర శక్తిగల సూర్యనాడి వుంటుంది. అది సూర్యునిలోని ప్రాణశక్తిని గ్రహించటం వల్ల పాలు పచ్చగా వుంటాయి. ఆ పాలని రోజూ త్రాగటం ద్వారా నిత్యయవ్వన వంతులవగలము.

## భార్య సంపాదించిపెట్టాల్సింది

■ భర్త ధనాన్ని సంపాదిస్తుంటే భార్య కుటుంబానికి ఆరోగ్యం సంపాదించి పెట్టాలి. ఉదయం లేవగానే ఈ యాంత్రిక జీవనంలో స్నానం చేసి వంట చేసి పెట్టే పరిస్థితులు లేవు. కనీసం పసుపు నీళ్ళు తన మీద అగ్నిహోత్రుని మీద చల్లి వంట చేయాలి. తద్వారా ఆరోగ్యం. అలాగే ద్వాదశి రోజు ఉసిరి పచ్చడిని వీలయినంతగా చేయటం ద్వారా కుటుంబమంతటికి మహా ఆరోగ్యకరం. ఉసిరి అమృత ఫలం. వృద్ధాప్యంలో కూడా తిరిగి యవ్వనాన్ని ప్రసాదించే దివ్యఫలం. అమావాస్య ఆదివారం రోజుల్లో అడిగిన వాళ్ళకి శక్తి ప్రకారం ఉసిరికలు లేదనకుండా సహాయం చేయాలి. ఆ రోజు చేసే దానం పితృదేవతలకి జలతర్పణం చేసినంత ఫలం. పితృ దేవతలు శాంతిస్తే మీ సంతానానికి ధనవృద్ధి, ఆయుర్ వృద్ధి. కొంతమంది తల్లులు పిల్లల్ని గట్టిగా కేకలేస్తూ లేపుతుంటారు. అలా చేయకూడదు. నిద్రనుంచి నెమ్మదిగా లేపండి. రెండు కాళ్ళను నేలపై ఆనించి ఇష్టదైవస్మరణ చేసి నెమ్మదిగా లేసేలా చేయండి. అనేక ప్రమాదకరమైన జబ్బులు దరికిరావు. కాన భార్య సంపాదించిపెట్టాల్సింది కుటుంబమంతటికీ ఆరోగ్యం.





## నీకు తెలుసు కదా అని ప్రతీదీ చెప్పేయకూడదు

■ విక్రమార్కుని సోదరుడు వర రుచి. అపార పండితుడు. ఓసారి రాణిగారి బొమ్మ వేశాడు. అందులో పుట్టుమచ్చ చూసి రాజు ఆగ్రహం చెందాడు. తనకి మాత్రమే తెలిసిన ఆ మచ్చ వరరుచికెలా తెలిసిందని ఏదో తప్పు పద్ధతుల్లో చూశాడని శిరచ్ఛేదనం చేయమని ఆజ్ఞాపించాడు. అతడు తన అపార పాండిత్య దివ్య చక్షువులతో గ్రహించానని చెప్పినా రాజు వినలేదు. కాన ఎంతవరకో అంతవరకే. నాకే తెలుసని ఏది పడితే అది చెబితే అలానే అవుతుంది.

## దగ్గరి వారు దూరమైతే...

■ సాయంకాల సమయంలో శివాలయంలో ప్రదక్షిణలు. నవగ్రహాల్లో సూర్యదేవుని వద్ద ఎర్రటి ఆరు వత్తులతో దీపారాధన చేయండి. శ్రీసూర్యస్తోత్రం పఠించి రేగు లేదా మారేడు చెట్టును నాటండి. ఆ చెట్లకి నిత్యం నీళ్ళు పోయండి. దూరమైన మీ ఆత్మీయులు దగ్గరవుతారు.

**శనీశ్వరుడు సహనశీలి.. ఓర్పు.. నెమ్మది తత్వము కలవాడు. అతిగా ఆవేశపడితే అనర్థాలను తెస్తాడు. గొడవలున్న వారు తొమ్మిది శనివారాలు శని గ్రహ కవచస్తోత్రమును పఠించండి. ఎంత ధనమొస్తుందన్నా, మరెంత బలం కలుగుతుందన్నా నేరచరిత్ర గలవారితో సన్నిహిత్యం వద్దు. ఇంకా ప్రవహించే నీటిలో నల్ల నువ్వులు వదలితే సత్వర ఫలితము కనిపిస్తుంది.**

## మీ ధనం మీకు మహావ్యధలు

## సంపాదించి పెట్టేలా చేయకండి

■ అన్నదానం అన్ని దానాల్లో కెల్లా ఉత్తమోత్తమమైన దానం. అలాంటి దానం చేస్తే ఎవ్వరికైనా పాపం వస్తుందా? పూర్వం ఓ మహారాజు శాస్త్రాల్లో చెప్పిన ప్రకారం అన్న దానం మహా పుణ్యమని తలచి అన్నదానం చేయుటం ప్రారంభించాడు. భక్తులకీ, ఆకలిగొన్నవారికీ, అనాధలకూ పెట్టాల్సిన అన్నాన్ని ఎవరొస్తే వాళ్ళకి పెట్టసాగాడు. ఓ దూర్తుడు ఓ రోజు శుభ్రంగా పీకల వరకూ తిని కండువాలో అన్నాన్ని మూటగట్టుకుని మరీ వెళ్ళాడు. కొంతదూరం వెళ్ళి ఓ చెరువు పక్కన ఆగాడు. అందులోని చేపలని చూడగానే తినాలనిపించింది. అంతే కొంత అన్నాన్ని చెరువులో వేసి చేపలని పట్టుకొని తిన్నాడు. చేపలను తినగానే మద్యం తాగ్రాడు. మద్యం తాగగానే స్త్రీ మాంసం కావాలనిపించింది. అనగా స్త్రీపై కోరిక కలిగింది. ధనం కోసం ఓ వృద్ధ బాటసారి దంపతులని చంపి ధనాన్ని పొంది సాని వద్దకు వెళ్ళాడు. చూశారా... అపాత్ర దానం ఎంతటి మహా పాపాన్ని రాజుకి మిగిల్చిందో. దాని వల్ల ఆ మహా పాపాల వల్ల అపాత్రదానం వల్ల ఆ రాజు మహా దురవస్థలకి లోనయ్యాడు. నానామాటలు పడ్డాడు. మహాదరిద్రాలని తను పడటమే కాక తన వారికీ అందించాడు. కాన ధనాన్ని దానానికి ఉపయోగించేటప్పుడు ఆచితూచి నిర్ణయం తీసుకోండి.





## గృహంలో నుంచి జ్యేష్ఠాదేవి వెళ్ళాలంటే...

- ■ ధర్మకార్యాల్లో పాల్గొనాలి.
- ■ యజ్ఞయాగాదులు, సేవాకార్యక్రమాలు చేయాలి.
- ■ ఎక్కువసేపు దేవాలయాల్లో ధ్యాన చింతనలో గడపాలి.
- ■ విద్యుత్తుధర్మాన్ని తు.చ తప్పక పాటించాలి.
- ■ తప్పులు చేసిన వారిని క్షమించాలి. కానీ రెండోసారి తప్పు చేస్తే క్షమించకూడదు.
- ■ రోజులో కొంతసేపైనా ఏకాంతంగా గడపాలి.
- ■ వారంలో ఒక్కరోజైనా మీ జేబులోంచి ఒక్కరూపాయి కూడా తీయకుండా గడపాలి.
- ■ రోజుకి ఇరవై నిమిషాలైనా మౌనవ్రతం చేయాలి.

## శని ఆవహించే ప్రధాన ద్వారాలు.. మద్యం .. మగువ

■ మద్యం ద్వారా తాత్కాలిక ధైర్యాన్నిస్తాడు. దాంతో మాటలు కోటలు దాటుతాయి. ఆ మాటలు అవతల వాళ్ళకి తీవ్రమైన కోపాన్నీ, ద్వేషాన్నీ తెప్పిస్తాయి. దాంతో సమస్య పెద్దదవుతుంది. శని కార్యానికి మార్గం సుగమం అవుతుంది. ఇక స్త్రీ విషయంలో అయితే మరీ తేలిక. ఆ వ్యామోహంలో ఆ బలహీనతతో తన చరిష్మా.. జ్ఞానం... పెద్దరికం అన్నీ పోతాయి. వాలు చూపు కోసం.. సుఖం కోసం జీవితంలో ఏనాడూ కూర్చోని కూడా ఎరగని వాళ్ళని సహితం దుర్భర పరసరాల్లో ఉండేలా చేస్తాడు.

## పట్టిందల్లా బంగారమే

■ ఆలోచనలకి పదునుపెడితే ధనం రావటంఎంతో సేపు పట్టదు. ఒక్కసారి రావటమంటూ జరిగితే కష్టించి పని చేస్తే వచ్చే లక్ష్మీ కటాక్షం మిమ్మల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. అంత సంపద ఇంతవరకు ఎక్కడుందా ఇదంతా నాదేనా, నేను సంపాదించినదేనా అని ఆశ్చర్యపోతారు. ఆలోచించండి. కష్టించడమే అసలు సిసలు సంపద రహస్యం. అన్న రావణుడు సంపదనంతా తీసేసుకోవటంతో కుబేరుడు ఆలోచించి ఈశ్వరునితో స్నేహం చేశాడు. ఫలితం శ్రీ వేంకటేశ్వరునికి అప్పిచ్చే స్థాయికి ఎదిగాడు. ఒక్కమాట గుర్తు పెట్టుకోండి. మీనుంచి పోయినదంతా మీరే పోగొట్టుకున్నారు. తిరిగి తెచ్చుకోవాల్సింది మీరే. ఎవరూ మీకు తెచ్చి ఇవ్వరు. సహాయం చెయ్యరు. వీలయితే లాగటానికి ప్రయత్నిస్తారు. ఆ విషయం గుర్తుపెట్టుకుని నడక సాగించండి. అవసరమైనప్పుడే పరుగులు తీయండి.

## శనీశ్వరుడూ, జ్యేష్ఠాదేవి...

■ జ్యేష్ఠాదేవి భర్తతో ఓసారి అంది.. 'స్వామీ.. మీరు వక్ర దృష్టితో చూసినా ఆ ఇంట నేను ప్రవేశించకపోతే ఏం చేస్తారని.. ఏం చెయ్యగలరని' అడిగింది. దానికి శనీశ్వరుడు 'దేవీ... నా వక్ర దృష్టితో చుట్టూ వున్న వాళ్ళను దూరం చేస్తాను. తద్వారా సమస్యలు సృష్టిస్తాను. దాంతో ధనం తగ్గుతుంది. ధైర్యం నశిస్తుంది. క్రమంగా పిరికితనం రూపంలో ఆవహిస్తాను. ఆ తర్వాత మిగిలిన అష్టకష్టాలను పెడతాను. మనుజుడు భయపడ్డాడంటే నేను ఆవహించినట్టే. నీకే తెలియకుండా నీవు ఆ గృహంలో ప్రవేశిస్తావు."





## గొడవలకీ, భార్యాభర్తల వియోగానికీ కారణం కుజుడు

■ పధ్నాలుగేళ్ళు శ్రీరామచంద్రుడు వనవాసం చేశాడు తండ్రి మాట కోసం. మరి ఊర్మిళ భర్తకి పధ్నాలుగేళ్ళు దూరం అయ్యింది. లక్ష్మణుడి భార్య భర్తకి దూరమవ్వటానికి కుజగ్రహ వక్ర దృష్టే కారణం. కుజుడు కోపకారి. గొడవలకి కారకుడు. భార్యాభర్తల మధ్య అంతరాలు వున్న వారు కుజ గ్రహ శాంతి, హోమం చేయించండి.

## ధనం తరిగిపోతుందా...

- ■ మీ వ్యసనాలని నియంత్రించుకోండి.
- ■ చుట్టూ వున్న వాళ్ళని గుడ్డిగా నమ్మకండి.
- ■ గత నెలలో మీరు పెట్టిన ఖర్చులో వ్యర్థంగా చేసిన ఖర్చును చూసుకొని సరిచేసుకోండి.
- ■ ఎట్టి పరిస్థితుల్లోనే దిగులుగా కనిపించకండి.
- ■ డబ్బు సమస్యల గూర్చి అస్సలు మాట్లాడకండి.
- ■ స్కూల్‌కెళ్ళే విద్యార్థిలా తయారయ్యి బైటికెళ్ళండి.
- ■ ఎవరి గూర్చి ఆవేశంగా మాట్లాడి నోరు జారకండి.
- ■ తెలిసిన వాళ్ళకి సమస్యలొస్తే 'వారికంతే అవ్వాలనీ, జరగాలనీ' అనుకోకండి. పక్కన నిలబడి ధైర్యం చెప్పండి. ఆ ప్రయత్నంలో ఇరుకున పడద్దు.
- ■ సమస్యలు సృష్టిస్తుంటే వారిలో లోపాలని గమనించండి. ఆపై స్పందించండి.
- ■ అవతల వారెంత ద్రోహానికి పాల్పడినా చట్ట వ్యతిరేకంగా నిర్ణయం తీసుకోకండి.

## ప్రతి వాని మీద గ్రహ ప్రభావం వుంటుంది

■ కౌసల్యా దేవికి శ్రీమహావిష్ణువు శ్రీరామచంద్రుడిగా జన్మించే సమయంలో గ్రహాలన్నీ చక చకా ఉచ్చ స్థితిలోకి వెళ్ళాయని రామాయణం శెలవిస్తోంది. కాన గ్రహ పూజలు, ప్రదక్షిణలు ప్రతి పదిహేను రోజులకి ఒక్కసారన్నా చేయటం చాలా మంచిది.

## ధనం మనకే కాదు శ్రీమహావిష్ణువుకి కూడా అవసరం

■ బ్రహ్మదేవుడు సృష్టిస్తాడు. దానికి ధనం అక్కర్లేదు. ఈశ్వరుడు లయం చేస్తాడు. దానికీ ధనం అవసరం లేదు. శ్రీమహావిష్ణువు పాలించాలి. పధ్నాలుగు లోకాలని పాలించాలి. ఎంత ధనం కావాలి. అందుకే శ్రీమహాలక్ష్మిని పక్క నుంచు కున్నాడు. భార్యగా చేసు కున్నాడు. కాన పాలించాలన్నా, నడిపించాలన్నా ధనం కావాలి. ఆ ధనం ధర్మబద్ధమైనదీ, న్యాయమైనదీ అయివుంటేనే మహాకీర్తి వస్తుంది. లేకపోతే ధనమున్నా నిరంతరం శోకభీతి, భయమే.

## నలుడు పూజించిన శివలింగాన్ని దర్శిస్తే

■ ఈ క్షేత్రం తమిళనాడులో వుంది. ఇక్కడ ఉన్న శివలింగము నలుడు ప్రతిష్ఠించి పూజించినది. ఆదివారం దర్శనం మరింత మంచిది. అక్కడ ఆలయంలో గ్రహ దోషాలకు చెయ్యాల్సిన పరిహారాలు రాసి వుంటాయి. ఈ శనీశ్వరుని క్షేత్రం దర్శించటం వల్ల అనేక సమస్యలకు పరిహార పరిష్కారాలు తెలిసేలా చేస్తాడు శనీశ్వరుడు.





## కార్యదీక్షత కోసం బుధగ్రహ స్తోత్రం చదవండి

■ ముక్తినీ, తెలివితేటలనీ ఇచ్చేది సరస్వతీదేవి. వాటిని అందించేది బుధుడు. కార్యసఫలతకు బుధగ్రహ పూజ, హోమం ఎంతో అవసరం. చదువు వంటబట్టని వారిని సహితం చదువులో ముందుకు తీసుకెళ్ళేది బుధుడే.

## పుట్టింటిపై ఆశ వుండచ్చు కానీ..

■ అది శ్రుతిమించకూడదు. పుట్టిల్లంటే క్షేత్రం వంటిది. క్షేత్రం వంటి ఆలయంలో కొంతసేపు వుంటే బాగుంటుంది. వుండాలి. రామేశ్వరం ఎంత మహాపుణ్యక్షేత్రమైనా మూడు రోజులు, మహా అయితే పదిరోజులు. అలాగే పుట్టింటి నుంచి ఆశించాల్సినవి ఆశించాలి. సంప్రదాయాన్నీ, ధర్మాన్నీ తప్పి ఆశిస్తే లభించకపోవటంతో పాటు విలువైన సమయం, గౌరవం, బంధాలు కూడా దూరమవుతాయి.

## అప్పు చేస్తే ఇచ్చిన వారితో తిరగొద్దు

■ స్నేహితుడనీ, సన్నిహితుడనీ, బంధువనీ మీరనుకొని తిరిగితే అది పొరపాటు. ఇచ్చిన వారు మిమ్మల్ని ఖచ్చితంగా తక్కువగానే చూస్తారు. అసలుకి వడ్డీతో పాటు చక్రవడ్డీగా వారి అహాన్నీ, దర్పాన్నీ, కోపాలనీ, తాపాలని కూడా రుద్దుతారు. వారి పక్కన బాడీగార్డ్‌లా వుంచు కోవాలనుకుంటారు. అన్నీ భరించి తీరాల్సివస్తుంది. అప్పు వద్దు. తప్పకపోతే వాళ్ళింటికి మీ ఇల్లు ఎంత దూరమో, మీ ఇంటికి వాళ్ళిల్లు అంతే దూరంలా వుండండి. అప్పుడే తీసుకున్న అప్పు తీర్చగలరు. ఆత్మాభిమానం నిలుపుకోగలరు.

## వ్యాపారంలో, వ్యవహారంలో ఇలాంటి లెక్కగాళ్ళతో జాగ్రత్త

■ నేను మరో వ్యాపారంలో సన్నిహిత్యం కలిగిన నా మిత్రుడొకడు కలిసి ఓ చిన్న డీల్ చేశాము. అతను నా దగ్గరికొచ్చి లెక్కచెప్పటం ప్రారంభించాడు. పేపర్ కొన్నాను. 2400... దానికి అట్ట 1160, ప్రిటింగ్ 800, బైండింగ్ 202, డి.టి.పి 526, ప్రూఫ్‌రీడింగి 146.

నేను వింటున్నాను. ఖచ్చితంగా చెబుతున్నాడు. ఆ రోజు లామినేషన్‌కి 420 నేనే ఇచ్చాను. నేను అలాగే... అలాగే అన్నాను. ఎందుకంటే ఖచ్చితంగా తేడా లేకుండా చెప్పి రాస్తున్నాడు. అంతా అయ్యాక స్లిప్ ఇచ్చాడు.

| | |
|---|---|
| పేపర్ | - 2400 |
| అట్ట | - 1160 |
| ప్రింటింగ్ | - 800 |
| బైండింగ్ | - 202 |
| డి.టి.పి | - 526 |
| ప్రూఫ్ రీడింగ్ | - 146 |
| లామినేషన్ | - 420 |
| | --------------- |
| | 6554 |
| | --------------- |

నేను వరుసగా చూశాను. అంతా ఖచ్చితంగానే వుంది. చివర టోటల్ కూడా. చివరి రెండు అంకెలు లెక్కపెట్టాను. ఇక నా వల్ల కాలేదు. అంతా నిక్కచ్చిగా రాశాడని డబ్బులిచ్చేశాను. ఆ తర్వాత గాని నాకు అర్థం కాలేదు. అతనెక్కడ చేశాడో. అర్థమయ్యేసరికి నాకు తల తిరిగింది. దటీజ్ మనీ.





## రాత్రికి రాత్రే పక్కింటి వాళ్ళు పారిపోయారా?

■ వాళ్ళు చేసిన అప్పులు వందయితే అది వెయ్యి అవుతుంది. వాళ్ళు వెళ్ళాక పదివేలని మాట్లాడుకుంటారు.

■ వ్యసనాలు కారణం ఇరవై శాతమే. మిగతా ఎనభై శాతం పది, పదిహేను రూపాయిల వడ్డీ. ఒక్క సంవత్సరం చాలు కుబేరుడు కూడా పెళ్ళాం బిడ్డలతో పారిపోవటానికి.

■ కొంతమంది వడ్డీవ్యాపారులు ఇంట్లో భార్య సంతకం కూడా పెట్టించమని అధిక వడ్డీలకు డబ్బులిస్తారు. కట్ట లేకపోయినప్పుడు డబ్బులిచ్చిన వారు ఇంటికొచ్చి భార్యని అవమానంగా మాట్లాడతారని డబ్బు తీసుకున్న వారు భార్యతో సహా పారిపోతారు. ఇంట్లో భార్య సంతకం తీసుకుని అప్పిచ్చిన ప్రతి వంద విషయాల్లో తొంభై శాతం పొయ్యేవే ఉంటాయి. అలాంటి స్థితిలో వున్న వాళ్ళు ఆత్మహత్య చేసుకోటం లేదా పారిపోవటం కాకుండా చట్టాన్ని ఆశ్రయించండి. నిజాయితీగా వున్నది చెప్పండి. పిల్లల భవిష్యత్తును పాడుచేయకండి. ఆ పాపం ఖచ్చితంగా తగిలి తీరుతుంది. అలాంటి సమస్యలున్న వారి గూర్చి ఎలాంటి హేళన మాటలు మాట్లాడకండి. అది దైవ నిందకన్నా పాపం.

**ఏ దేవాదిదేవునికైనా 108 లేదా వెయ్యి నామాలతో పూజలు నిర్వహిస్తారు. అయితే సకల జీవకోటికి అన్నప్రదాత సూర్య భగవానుడ్ని డెబ్భై నామాలతో స్మరించి ధ్యానిస్తే ఐశ్వర్యానికి మించిన ఆరోగ్యాన్నిస్తాడు. ఆరోగ్యం వుంటే ఐశ్వర్యం అదే వస్తుంది.**

## గెలుపు కోసం నిరంతరం శ్రమించాలి

■ రెండు దేశాల మధ్య యుద్ధం జరుగుతోంది. పడవలపై నది దాటి యుద్ధం చేయాల్సి వచ్చింది. తీరా వెళ్ళాక అవతల పక్క అపారమైన సైన్యం. దాంతో ఆ రాజు పడవల్ని కాల్చేయ్యమని ఆజ్ఞాపించి చెప్పాడు..'మనం బ్రతికి వుండాలంటే శత్రుసైన్యాన్ని గెలవాలి. వేరే దారిలేదని' చెప్పాడు. అందుకే పారిపోయేదారి మూసేశాను. పడవలని కాల్చేలా చేశాను. ఇక మన ముందు ఉన్నది ఒక్కటే .... గెలవటం లేదా చావటం. గెలిచాడా, ఓడాడా... జవాబు మీరే ఊహించండి.

■ విద్యుత్ దీపాన్ని కనిపెట్టడానికి ముందు ఆ ప్రయత్నంలో థామస్ ఎడిసన్ పదివేల సార్లు విఫలం అయ్యాడు. లక్ష్యాన్ని మాత్రం వదిలిపెట్టలేదు.

■ భూమి గుండ్రంగా వుందని చెప్పినందకు రాళ్ళతో కొట్టారు. అయినా సిద్ధాంతాన్ని వీడలేదు.

■ నమ్మకమే ఏదైనా సాధిస్తుంది. సైనిక శక్తి లేదు. యుద్ధ నౌకలు లేవు. మర ఫిరంగులు లేవు. ధనం లేదు. ఆఖరికి సొంతిల్లు లేదు. కోట్ల మంది భారతీయులకు స్వాతంత్ర్యాన్ని తన సిద్ధాంతం ద్వారా, నమ్మకం ద్వారా తెచ్చాడు జాతిపిత మహాత్మాగాంధి.

■ ప్రపంచ వ్యాప్తంగా అమ్ముడవుతున్న కోకోకోల స్థాపన ప్రారంభ పెట్టుబడి మన రోజు వారి ఖర్చంత ధనంతోనే.

■ బలం ద్వారా డబ్బు లేదా అధికారం సంపాదించినా అది తాత్కాలికమే. నెపోలియన్, ముస్సోలినీ, హిట్లర్‌లలా కాలగర్భంలో కలిసిపోవల్సిందే.

ఇవన్నీ నేనెందుకు చెబుతున్నానంటే డబ్బు సంపాదించటం పైవాటికన్నా అతి అల్పమైన చిన్న విషయం.





## లెక్కలు చూపిస్తూ ధనం సంపాదించండి

■ నాకు తెలిసిన చిన్న వ్యాపారస్థుడు సక్రమంగా లెక్కలు చూపిస్తూ సంపాదించిన ధనంతో ఓ కారు కొనుక్కున్నాడు. ఆనందంగా భార్యాపిల్లలతో తిరుగుతున్నాడు. మరొకతను లెక్కలు చూపకుండా మహా సంపద సంపాదించి అతి పెద్ద ఖరీదైన కారుకొన్నాడు. తీరా ఓ మంచిరోజున ఈ కారూ, ఆస్తులు ఎలా కొన్నావంటే నోటమాటరాలేదు. తలపట్టుకున్నా ప్రయోజనం శూన్యం.

## ప్రతి మనిషిలోనూ ఇద్దరుంటారు

■ ముంతాజ్ కోసం షాజహాన్ తాజ్‌మహల్ కట్టించాడు. కానీ అధికారం కోసం ముగ్గురన్నలనీ నిర్ధాక్షిణ్యంగా చంపాడు. ఇక ఔరంగజేబుకి తండ్రి అంటే విపరీతమైన ప్రేమ... కానీ అన్నదమ్ములతో పాటు సోదరిని కూడా చంపాడు అధికారం కోసం.

■ కన్న కొడుకు కోసం శ్రీరాముడ్నే అడవులకి పంపింది కైక.

■ తప్పు చేస్తే ఖచ్చితంగా ఎవరికీ తెలీదని తెలిస్తే ఇష్టముంటే ఏ తప్పయినా చేసేస్తారు.

■ వినయం... మర్యాద ఇచ్చినంతసేపు ఓ.కె. తేడా రాగానే మిమ్మల్ని పక్క నుంచుకున్న వాళ్ళే అధః పాతాళానికి నిర్ధాక్షిణ్యంగా నెట్టేస్తారు.

■ మద్యం తాగిన తర్వాత వచ్చేవాడు రెండో మనిషి కాదు.. వాడే మొదటి మనిషి.

■ అందంగా, సున్నితంగా ఉన్నంత మాత్రాన అందరికీ అందమైన, సున్నితమైన మనసు ఉండదు. అటువంటి వారి రెండో వైపు చూస్తే అందం మీదే విరక్తి పుడుతుంది.

## అప్పు బేరం, రొక్కం బేరం

■ వెయ్యి రూపాయిల సరకు రొక్కానికి అమ్మితే మిగిలేది ఓ పాతిక. మిగిలిందే సంతోషం. అదే అప్పు ఇచ్చి వెయ్యికి వంద ఆశపడితే అది ఎప్పటికీ దిగులుకీ, దుఃఖానికి కారణం అవుతుంది. అలా అని అప్పు వ్యాపారం చెయ్య కూడదని కాదు. ఆలోచించి అవతల వార్ని స్టడీ చేసి ఆపై చేయాలి.

## దైవం మనుష్య రూపేణా..

■ ఈశ్వరుడు దేవుడు. ఆయన్ని ఆరాధించటం, పూజించటం ద్వారా, సత్ప్రవర్తన ద్వారా ఆత్మశక్తిని ఇస్తాడు. మనోధైర్యం పెరుగుతుంది. తద్వారా స్వార్థ రహిత మనుష్యులు అనగా భగవంతునిలాంటి వాళ్ళు తారస పడతారు. ధనం, సుఖాలు వరిస్తాయి. అందుకే పెద్దలన్నది 'దైవం మనుష్య రూపేణా' అని. దైవం యొక్క సుగుణాలు గలవారైతే భగవంతుడి లాంటి వాళ్ళు మీరూ అవ్వచ్చు. అప్పుడే మీ చుట్టూ సస్యశ్యామలం అవుతుంది.

## ధనం నిలువ వుంచాలి

■ లక్షలు, కోట్ల గూర్చి కాదు నేను చెప్పేది. ఈ రోజు సంపాదన రేపు ఖర్చు పెట్టండి. ఆ చిన్నసూత్రం మీ ఆర్థిక పరిస్థితిని మారుస్తుంది. ఎంతలా మారుస్తుందంటే ఈ రోజు చేసిన అరిశెలను తిని చూడండి. అవి ఈరోజు సంపాదన అనుకోండి. దాన్ని రేపు తిని చూడండి. ఆ మజా అనుభూతీ తెలుస్తుంది. అరిశెలను ఈ రోజు చేసింది రేపు తింటే ఆ అద్భుత అనుభూతి, ధనం విషయంలో కూడా అంతే. నిన్న సంపాదించింది రేపు ఖర్చుపెట్టండి.





## స్థాయికి మించిన పనులు చేయుట తగదు

■ అవతల వాళ్ళని మించిపోవాలని స్థాయిని మరిచి ప్రయత్నిస్తే దుర్యోధనుడిలా భంగపడక తప్పదు. కర్ణుడి దాతృత్వానికి ధీటుగా ఎవరైనా దానం కోరితే కర్ణుడు ఇచ్చిన దానికి రెట్టింపు ఇచ్చేవాడు. ఓసారి యజ్ఞానికి కట్టెలు కావాల్సి దాన మడిగితే నీ ఇష్టమొచ్చినప్పుడు వచ్చి తీసు కెళ్ళమన్నాడు. కర్ణుడు ఇచ్చే వాటికి రెట్టింపు తీసు కెళ్ళమన్నాడు దుర్యోధనుడు. తీరా యజ్ఞ సమయానికి తీవ్ర వర్షాలు. అడవీ, నగరం తడిచి ముద్దయ్యాయి. అప్పుడొచ్చాడు బ్రాహ్మణుడు కట్టెలు కావాలని. దుర్యోధనుడు నా వల్ల కాదన్నాడు. కానీ కర్ణుడు గుర్రపుశాలలోని గుర్రాలని తన ఇంట్లో కట్టించి ఆ గుర్రపు శాలని పడగొట్టించి యజ్ఞానికి కావాల్సిన కట్టెలను ఇచ్చాడు. అందుకే పెద్దలనేది దాన గుణం, త్యాగ గుణాలు పుట్టుకతో వస్తాయి. మధ్యలో పక్కనోళ్ళని చూసి చెయ్యాలను కుంటే దుర్యోధనుడికి లభించిన భంగపాటే లభిస్తుంది.

## రాహుగ్రహ దోషం పోవటానికి

■ రాహు కాలంలో రాహువుకి పాలాభిషేకం చేసి కర్పూర హారతి వెలిగించటం ద్వారా రాహు గ్రహ దోషాలు సమసి పోతాయి. తమళనాడులోని విత్తువక్కడులోని రాహుక్షేత్రం దర్శించి అభిషేకం చేయలేనివారు మీ దగ్గరలోని శివాలయంలో రాహువుకి చేసు కొనవచ్చును.

## ధనం వచ్చి పడితే మీరేం చేస్తారు ?

■ ఓ రిక్షా కార్మికుడ్ని అడిగాను. ధనం కుప్పలుగా వస్తే ఏం చేస్తావని. అతను పెద్ద ఇల్లు కొనుక్కుంటాను, భార్యకి నగలు చేయిస్తానని చెప్పాడు.

■ ఈసారి ఓ ఉద్యోగస్థుడ్ని అడిగాను, అతను హాయిగా కాలుమీద కాలేసుకుని ప్రపంచమంతా చుట్టి వస్తానన్నాడు. ఆపై వ్యాపారవేత్తని అడిగాను. అప్పులు తీర్చి వడ్డీకిచ్చేస్తానన్నాడు.

కానీ నిజానికి వారు చెప్పాల్సింది ఆ సమాధానాలు కావు. పదివేల రిక్షాలు తాయారు చేసే ఫ్యాక్టరీ పెట్టాలనీ, కొన్ని వేలమందికి ఉద్యోగాలిస్తాననీ, ప్రపంచ వ్యాప్తంగా వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరిస్తానని. అలా చెయ్యటం వల్ల ఇళ్ళూ నగలూ వస్తాయి, ప్రపంచయాత్రలు అన్నీ మీ డోర్ దగ్గర వేచి వుంటాయి. ధనం దాచిపెట్టడం అందరూ చేసే పని. ప్రతి రూపాయినీ పెట్టుబడిగా పెట్టడం దాన్ని నష్టం లేకుండా లాభంతో వ్యాపారం చెయ్యడమే మహా సంపదలకి ప్రధాన సూత్రం.

## కూతురు... కొడుకు ఆర్థిక బాధల్లో ఉంటే

■ పూర్వం పెద్దలు తమ సంతానం ఆర్థికంగా, హార్దికంగా ఇబ్బందులు పడుతుంటే పవిత్ర పుణ్యక్షేత్రాలని దర్శించి నేరుగా వారింటికి వెళ్ళే వాళ్ళు. అలా వెళ్ళటం వల్ల వారు చేసిన పుణ్యఫలం వల్ల ఆ కుటుంబానికి సుఖసౌఖ్యాలు అందుతాయని. తీర్థయాత్రలు సుఖంగా చేసేలా చేసేది శని. శని శుభదృష్టి పడినవాళ్ళు... నష్ట పోయిన వారితో కలిసిన శని వారికి శుభ దృష్టినిస్తాడు. అందుకే అలా చేసేవాళ్ళు పెద్దలు.





## ఈ రోజుల్లో ధనం ఖచ్చితంగా సంపాదించాల్సిందే

■ పాత రోజుల్లో మన తాతల కాలంలో ఇంటికి అద్దె లేదు. కరెంట్ బిల్లుల్లేవు. పెట్రోల్, టి.వి, ఐమాక్స్‌లు, స్కూల్, కాలేజి ఫీజులు... ఒక్కొక్కరికీ ఒక్కో వాహనం వంటివన్నీ లేవు. పీపాల నీళ్ళు కొనక్కర్లేదు. ప్రతి ఇంట్లో పాడి వుండేది. ఇంటికి వచ్చిన వారికి మంచి నీళ్ళు కూడా ఇవ్వలేని స్థితి ఇప్పటిది. అతిథికి మజ్జిగ ఇచ్చేవాళ్ళు. పంటకాలువల పక్కన కూరగాయలు పెరిగేవి. అవే ప్రతివారికి ఎక్కువయ్యేవి. స్వచ్ఛమైన నీరుపారేది. కావిళ్ళతో తెచ్చుకోవటమే. ఇంట్లో పెళ్ళయితే వూరంతా వచ్చి పసుపు కొట్టి పెళ్ళి అయ్యేంత వరకూ అన్ని పనులను చూసుకునే వారు. కానీ ఇప్పుడో... ఉదయం లేచిన దగ్గర్నించి జేబులో డబ్బు లేకపోతే ఒక్క క్షణం గడవదు.

నాటకాలకీ, తిరణాలకీ వెళ్ళాలంటే సైకిల్ మీద, ఎడ్ల బండ్ల మీద వెళ్ళే వాళ్ళు. సైకిల్ మీద భార్యనెక్కించుకుని వెళ్తుంటే ఎలా వుంటుందో వెళితేనే తెలుస్తుంది. అదే ఇప్పుడు చేస్తే అదో టాపిక్. కాన ధనం ఖచ్చితంగా సంపాదించాల్సిందే. నిలువ వుంచుకోవాల్సిందే. దానికి మార్గం.. మీ వృత్తిలో అవతల వాళ్ళు ఎలా సంపాదించారో, సంపాదిస్తున్నారో గమనించండి. అంతే అదే సూత్రం.

**ఉపవాసం ఒక్కపూటే ఉండాలి. ఎక్కువ సమయం వుంటే శరీరంలోని ఆకలి తాలూకా అవయవాలు శరీరంలోని మలాన్ని తినటం ప్రారంభిస్తాయి. ఇదే విషయం వేమన కూడా చెప్పి వున్నారు.**

## వ్యసనాలున్న వాళ్ళతో తిరగద్దు

■ స్నేహం, మంచితనం... మీరేమనుకుని తిరిగినా, మీ కష్ట సమయంలో వాళ్ళేమీ కనీసం ఇసుమంత సహాయం కూడా చెయ్యరు. అలాంటి వాళ్ళకి మీరే జీవితాంతం చేస్తుండాలి. దానికి కారణం వారికున్న వ్యసనాలు. వారి చుట్టూ వున్నవాళ్ళెవరూ వాళ్ళని నమ్మరు. రాహువు ఎలా అయితే తన ఆధీనంలో వున్న వారిని కలచి వేస్తాడో అలా చేస్తారు. గౌరవించరు సరికదా అతని పక్కనున్నందుకు మీకూ అదే గౌరవం లభిస్తుంది. అపార ధనరాసులు మీ వద్ద వుంటే అలాంటి వ్యసన పరులతో స్నేహం ఎంతవరకో అంత వరకు చేసినా కొంత పర్వాలేదు. మధ్య తరగతి వాళ్ళయితే ఆర్థికంగా తీవ్ర నష్టం. అదీ ఒక్కోసారి మానసికంగా కృంగదీస్తుంది కూడా.

## కాలసర్ప దోషం వుండి వుండచ్చు

■ దిగులుగా ఉండటం.... విపరీతమైన భయం..... భయంకరమైన ఆవేశం.. దీర్ఘకాలికంగా అనారోగ్యాలు. ఏ పనీ చెయ్యలేక పోవటము. ఆలోచనలతో గడపటం.. ఇత్యాదివన్నీ కాలసర్పదోషం వల్ల కలుగుతాయి. కాలసర్ప దోషమంటే పాములపై తెలిసీ తెలియక అపచారం చెయ్యటం. నాగజాతికి అపచారం చెయ్యటమంటే వంశానికి కీడు తెచ్చుకున్నట్టే. మీ వంశంలో వాళ్ళెవరు చేసినా అది మీకూ, మీ సంతానానికీ తగలచ్చు. శ్రీకాళహస్తి, త్రయంబకేశ్వర్ వంటి పుణ్య క్షేత్రాల్లో పరిహారశాంతి చేయించుకుంటే మంచిదని శాస్త్రం శెలవిస్తోంది.





## నగలూ, చీరలూ కొనుక్కుంటే

■ గబ గబ పక్కింటివారికీ, ఎదురింటి వారికీ, చుట్టాలకీ, పక్కాలకీ, చూపించకండి. మీరు కట్టుకొన్నప్పుడూ, వేసుకున్నప్పుడూ మాత్రమే చూపించటానికి ప్రయత్నించండి. ముందే చూపిస్తే దిష్ఠి తగలటం ఖాయం. కేతువు వక్ర దృష్టితో చూస్తే ఎలాంటి విపరీత ప్రభావాలు కలుగుతాయో అలా కలుగుతాయి.

## వయసులో పెద్దవాళ్ళతో జాగ్రత్త

■ వయసు పెరుగుతున్న కొద్దీ అనగా పదహారు నుంచి అరవై వరకు.. అలాంటి వారు స్నేహ, సన్నిహిత సంబంధ వ్యాపార వ్యవహారాదులు చేసే వాళ్ళ వయసు పరగణలోకి తీసుకొని జాగ్రత్తగా వుండాలి. మనకన్నా వయసులో ఒక్కరోజు పెద్దవారితో వ్యవహారం చేసేటప్పుడు చాలా జాగ్రత్తగా వుండండి. వయసు పెరిగే కొద్దీ కొంతమందిలో జ్ఞానం, ధర్మం, న్యాయం పెరుగుతుంది. వందకి తొంభై అయిదు శాతం మందికి వయసు పెరిగే కొద్దీ మనసు కుళ్ళి పోతుంటుంది. అది ఒక్క రోజు వయసులో చిన్నవారైనా ఆ విషయాలు తెలుసుకోవటానికి చాలా సమయం పడుతుంది. కానీ అప్పటికే జరగాల్సిన నష్టం జరుగుతుంది. పెద్దవాళ్ళతో జాగ్రత్త. మళ్ళీ చెబుతున్నాను. పెద్దవాళ్ళంటే ముసలి వారు కాదు. మీకన్నా వయసులో ఒక్కరోజు పెద్దవారైనా వారితో వ్యవహారాదులలో జాగ్రత్త. అణు బాంబుల కన్నా ప్రమాదకరంగా మనకి సలహాలు ఇస్తుంటారు. మంచీ, చెడు చెబుతుంటారు. కానీ... చెప్పే మంచీ.. లాభం వారికే.

## నా వెనుకవాళ్ళునారు, వీళ్ళున్నారు అని మిడిసి పడకూడదు

■ ఖర్మ బాగోలేకపోతే వాళ్ళూ వీళ్ళూ అన్న తేడా వుండదు. ఎంతటివారైనా మరెంత పెద్దవాళ్ళు వెనకున్నా జరిగేది జరక్క మానదు. ఇల్లూ, వాకిలీ భార్యా పిల్లల్నీ వదలి పారిపోవాల్సిందే. ఓ పావురానికి సాక్షాత్తు గరుత్మంతుడితోనే స్నేహం కలిగింది. ఆ సన్నిహితం వల్ల యమగండం వుందని తెలిసింది. ఆ రోజు రానే వచ్చింది. ఆ రోజు గరుత్మంతుడి తోనే వుంది. దేవలోక సభలో యాగానికి వెళ్ళారు. అప్పుడు యముడు కూడా వచ్చాడు. పావురాన్ని చూసినవ్వాడు. దాంతో పావురం మరింత బక్కచిక్కి పోయింది. గరుత్మంతుడు ఓదార్చి పావురాన్ని సప్తసముద్రాల అవతల ఉన్న మర్రిచెట్టు తొర్రలో దాచి ఇంద్ర సభకొచ్చాడు. యముడి వద్దకెళ్ళాడు. పావురం ఎక్కడన్నాడు. యముడికి విషయం చెప్పాడు గరుత్మంతుడు. యముడు మళ్ళీ నవ్వి.. ఆ పావురానికి సప్తసముద్రాల అవతల ఉన్న మర్రి చెట్టు తొర్రలో నున్న పాము చేత ప్రాణగండం వుంది, నీ పక్కనుండటంతో చూసి ఆహా గండం తప్పిందనుకున్నాను. కానీ బ్రహ్మ రాత. నీవే స్వయంగా సప్తసముద్రాల అవతల వదలి వచ్చావు' అన్నాడు. కాన జరిగేదాన్ని తప్పించడం ఎవరి వల్ల కాదు. వెనుక వాళ్ళున్నారు, వీళ్ళున్నారు అని మిడిసిపడినా..... జరిగేది జరక్కమానదు. అలాంటప్పుడు దైవస్మరణే కాపాడుతుంది.





## నవగ్రహ దోషాలకి ఆవుపాల దానము

■ దానాల్లోకెల్లా మహా దానం గోదానం. ఈనిన గోవుని బిడ్డతో సహా ఇస్తే భూప్రదక్షిణతో సమానము. అట్టి గోదానాలకు సర్వగ్రహ దోషాలు పోతాయని శాస్త్రం శెలవిస్తోంది. ఇంకా పూర్వ జన్మ పాప కర్మలు కూడా పోతాయని చెబుతోంది. అయితే నేటి ఆర్థిక పరిస్థితుల్లో గోవుని దానం ఇచ్చే శక్తి ఎవ్వరికో గాని వుండదు. అందుకనే ప్రతిరోజు తొమ్మిది లీటర్ల ఆవుపాలను కొని ఏదన్నా ప్రదేశంలో ఫలానా సమయం నుంచి ఫలానా సమయం వరకు ఆవుపాలను ఉచితంగా ఇస్తామని ప్రకటించి ఆవు పాలను దానంగా ఇవ్వచ్చు. మీ శక్తిని బట్టి అలా ఆవుపాలను ఇన్ని రోజులు అని అనుకుని ఇవ్వటం ద్వారా కొంతయినా గోదాన ఫలం కలిగి నవగ్రహ దోషాలు సమసిపోతాయి. అలాగే దూరంగా వున్న తల్లి దగ్గరికి వెళ్ళలేక పోతుంటే ఆ బాధను పోవటానికీ, ఉపశమనం పొందటానికీ ఆవుకి నమస్కరించండి.

## టెంకాయ కొట్టినప్పుడు

■ పువ్వు వస్తే జీవితంలో కొత్త మార్పు లొస్తాయి. శుక్రవారం, శనివారం, పండుగ పర్వదినాల్లో కొబ్బరి కాయలో పువ్వు వస్తే అద్భుత శుభపరిణామాలు.

**జేబులోంచి డబ్బులు తీసి ఖర్చు పెట్టడం మానేసిన రోజు నిజమైన స్నేహితులెవరో తెలుస్తుంది. అసలు జేబులో చెయ్యే పెట్టక పోతే నీకంటూ స్నేహితులే మిగలరు.**

## చిన్నపిల్లల దగ్గర ధనక్రోధాలను చూపించకండి

■ అలాచెయ్యటం వల్ల అరవై లక్షల మందిని చంపేశాడు. మహానియంత హిట్లర్. చిన్నతనంలో అతడు వియన్నాలో ధనికుల ఇళ్ళకి రంగులేసేవాడు. ఆ యాదు ధనికులు ధనం లేనివార్ని చాలా హీనంగా చూసేవాళ్ళు. తమ ధనప్రతాపాలను చూపించేవారు. అలా అతడిలో పేరుకుపోయిన కసి యాదులందరినీ నరికి వేసేవరకు వచ్చింది. కాన మన దగ్గరున్న ధనం అహంగా మారితే దాని తాలూకు ప్రభావం మనవైపు చూపకున్నా సమాజం మీద చూపితే ఆ పాపం కూడా మనదే. కొంతమంది యాదుల ధన అహంకి పిల్లా, పెద్దా, స్త్రీలు అని తేడా లేకుండా ఊచకోత కోయించాడు హిట్లర్.

## ఒక్క రోజులో నవగ్రహ యాత్ర...

■ జీవితంలో అన్ని దారులు మూసుకుపోయినప్పుడు.... పూర్తి స్థాయి నిర్లిప్తతలు ఏర్పడినప్పుడు నవగ్రహ యాత్ర చేస్తే సమస్యలు సమసిపోతాయి. అంగారక గ్రహ ఆలయం వైదీశ్వరన్ కోయిల్.. బుధగ్రహ ఆలయం తిరువెన్కాడు... శుక్రగ్రహ ఆలయం కన్చనూరు.. కేతుగ్రహ ఆలయం కీల్పుమ్పల్లమ.. గురుగ్రహ ఆలయం ఆలంగుడి.. శనిగ్రహ ఆలయం తిరునల్లారు. రాహుగ్రహ ఆలయం తిరునాగేశ్వరం. చంద్రగ్రహ ఆలయం తిన్గలూరు.. సూర్యగ్రహ ఆలయం వ సూరిమానాడు... వీటిని దర్శించండి. ఇవన్నీ ఒక్క రోజులో కుంభకోణం నుంచి సూర్యుని దేవాలయంతో ప్రారంభించి దర్శించవచ్చు. ఈ ఆలయాలన్నీ తమిళనాడులో ఉన్నాయి.





## మెట్టె పెట్టుకున్న కాలివేలితో బొటన వేలిని రాస్తే

■ స్త్రీ అంటే లక్ష్మి. ఆర్థిక రూపేణా, మానసిక రూపేణా లక్ష్మి. అనగా స్త్రీని బాధిస్తే ఆ స్త్రీ మెట్టె పెట్టుకున్న వేలితో బొటన వేలిని రాసి సంకల్పించి శాపం పెడితే హరిహరాదులు అడ్డం వచ్చి ఆపాలని చూసినా ఆ శాపం తగిలి తీరుతుంది. దక్షయజ్ఞంలో పైన చెప్పిందే జరిగింది. అందుకే ఆదిశక్తి వంటి ఆడదాని కోపక్రోధాలు బైటపడకుండా మెట్టెపెట్టుకునే వేలు బొటన వేలికి తగలకుండా మెట్టెలను ధరించేది. అనగా స్త్రీని బాధపెడితే పైవి రెండూ దూరమవుతాయని పరమార్థం.

## ఆరోగ్యలక్ష్మిని ఎవరి చేతుల్లో పడితే వారి చేతుల్లో పెట్టకండి

■ సకల ఐశ్వర్యాలకన్నా ఆరోగ్యమే మహా ఐశ్వర్యం. ధనం ఖర్చు అవుతుందనీ, పక్కనోళ్ళు నమ్మకంగా చెప్పారని చేతిని అందిస్తే మిగిలేది మీవారికి మహా దుఃఖం. మధుర గాయకుడు, మహాభగవత్ స్వరూపుడు, అపార జ్ఞాని దయా సరస్వతి వంటి వారు అలా పక్కన వాళ్ల మాటలు వినే తమ ఆయుష్షును ముప్ఫయి రెండు, ముప్ఫయి అయిదేళ్ళకే చాలించారు.

ఇంకా ఆరోగ్యం, ఆయుష్షుల కోసం.... ఆదివారం సాధువులకూ, పేదలకీ చపాతీలను పంచండి. సూర్యస్తుతిని తొమ్మిదిసార్లు పఠించండి.

## సృష్టిలో ఫస్ట్ సెటిల్‌మెంట్

■ క్షీరసాగర మథనంలో ధన్వంతరి తెచ్చిన అమృతాన్ని శ్రీమహావిష్ణువు మోహినీ రూపంలో దేవతలకి పంచుతుండగా రాహు కేతువులు దేవతల రూపంలో తాగారు. దాన్ని సూర్యుడూ, చంద్రుడూ గమనించి శ్రీ మహావిష్ణువుకి చెప్పటంతో శ్రీచక్రంతో వారి శిరస్సులను ఖండించాడు. శరీరాలు లేకుండా రాహుకేతువులు నిలిచారు. ఆపై శివవర ఫలంగా చూసేవారికి కనపడేలా వరం పొందారు. అయితే తమ స్థితికి సూర్యచంద్రులు కారణమని రోజూ వారిని పట్టి పీడించేవాళ్ళు. దాంతో లోకాలకి మహా కష్టాలు ప్రారంభ మయ్యాయి. త్రిమూర్తులు పూనుకుని రాహుకేతులకి నచ్చ చెప్పి రోజూ అలా చేస్తే లోకహితం జరగదన్నారు. అయినా వారు వినకపోవటంతో చివరకు సంవత్సరంలో కొన్నిసార్లు మాత్రమే మీరు పట్టాలనీ, మీ పగను అలా చేయటం ద్వారా తీర్చుకోమని సెటిల్ చేశారు. ఆనాటి నుంచి నిత్యంగాక సూర్య, చంద్ర గ్రహణాలు అప్పుడప్పుడు వస్తున్నాయి. అలా ఫస్ట్ సెటిల్‌మెంట్ చేసింది త్రిమూర్తులే.

## పాలు చల్లి నైవేద్యం చేయండి

■ నేలపై పాలు చల్లి.. ఆపై కట్టెల పొయ్యి మీద శ్రీమహాలక్ష్మీదేవికి నైవేద్యం తయారు చేసి నివేదించండి. ఎంత ప్రయత్నించినా అవ్వని కార్యం సుగమము అవుతుంది.





## ధన యోగమా.. రాజ యోగమా

■ ఈశ్వరాలయంలో శివలింగానికి అభిషేకం చేయించేటప్పుడు మారేడు దళాలు తీసుకెళ్ళండి. వాటితో శివార్చన చేస్తూ పంతులుగారు శివలింగానికి సమర్పి స్తుంటాడు. అప్పుడు గమనించండి. మారేడు దళం శివలింగానికి తగిలి బోర్లా పడితే త్వరలో ధనయోగం.. తిప్పి పడితే రాజయోగం. అలా అని పంతులుగారిని దళం బోర్లా పడేలా వేయాలని చెప్పకండి. మీరు చెయ్యకండి. అలా చేస్తే ఆ రెండూ గాక మరొకటి మిమ్మల్ని వరిస్తుంది. పూజా మందిరానికి చీపురు తగిలితే కలిగే దోషం కూడా మీకు కలుగుతుంది.

## శరీరాన్ని బాధపెట్టే శుచి వద్దు

■ ఉత్తరాది పుణ్యభూమి. దక్షిణాది కర్మభూమి. ఈ కర్మభూమిలో నిత్యఅనుష్ఠానం చేయాలి. అలా అని ఉత్తరాది అనగా చలిదేశాల్లో కూడా మూడు పూటల స్నానం చేసి పూజ చేస్తానంటే న్యుమోనియా వస్తుంది. ఫలితం.. ఒక్కసారి దేశం మహా పురుషుల్ని పోగొట్టుకోవాల్సి వచ్చింది.. వస్తుంది.

**తోటివాడి కూడు ఎంగిలి చెయ్యాలనకుంటే ఇంటి కూడు ఎంగిలవుతుంది. అది కూడు అయినా, ధనమైనా, వ్యాపారమైనా, వ్యవహారమైనా,ఆడదయినా సరే.**

## మధ్యతరగతి మనిషిలా ఎందుకు మిగిలిపోతారు

■ మీ అతికోపం వల్ల....... దాని వల్ల కావాల్సిన దాన్ని పొందటం కోసం మీకు కోపం తెప్పించి లాభపడతారు.

■ వ్యసనాలున్న వాళ్ళతో తిరగటం వల్ల........ దాని వల్ల మిమ్మల్ని వాళ్ళతో జత కట్టడం వల్ల ధన రూపేణా, గౌరవరూపేణా నష్టం.

■ మీకు ప్రతిదానికి జేబులో చెయ్యి పెట్టడం అలవాటు వుంటే...... అవతల వాళ్ళు జీవితాంతం వాళ్ళ జేబుల్లో చెయ్యిపెట్టరు.

■ మీరు అమాయకులు కాకపోయినా....... అవతల వారు అనుకుంటే చాలు ఏదో ఒకరోజు మిమ్మల్ని ఆర్థికంగా దెబ్బ తీస్తారు.

■ పొగిడితే.. మీ చుట్టూ తిరిగితే ఆ రోజు గడిచిపోతుందనకుంటే మీ పని ఆర్థికంగా అయిపోయినట్టే. అదే మీ దగ్గర ధనం లేనప్పుడు కనుచూపులో ఒక్కడు కూడా కనిపించడు.

■ మీకు నచ్చని వాళ్ళనీ, మీతో తేడా వున్నవాళ్ళనీ విమర్శిస్తున్నారంటే.. వాళ్ళు మీనుంచి ఏదో ఆయాచితంగా ఆశిస్తున్నారనే.

■ ఆర్థిక రూపేణా మీరు ఇబ్బందుల్లో వున్నారని తెలిస్తే రూపాయి వడ్డీకి అప్పిచ్చే వాళ్ళు తొమ్మిది రూపాయిల వడ్డీ వరకు తీసుకుకెళ్తారు. అంతెందుకు మీరు కుటుంబ అవసరాలకి తప్ప బయట వక్కరుపాయి కూడా తియ్యకుండా ఎప్పటిలా వుండండి. అందరితో సంచరించండి. ఎంత ధనం మిగులుతుందో. మీరెంత ధనాన్ని పోగొట్టు కున్నారో తెలుస్తుంది. ధనాన్నిచ్చే శుక్రుడు కూడా అలాంటి వారి విషయంలో ఏమీ చెయ్యలేడు.

అయితే ఈ పరీక్షలో మీరు స్నేహితులు అనుకునే వారు కొంతమంది దూరమవ్వచ్చు. డబ్బు కన్నా స్నేహం ముఖ్యమనుకుంటే నేను చెయ్యగలిగిందీ, రాసేదీ ఏమీ లేదు.





## మహా సంకల్పము ఇంకా కోరిన కోర్కె తీరుటకు

■ తిరుమల పాపనాశనంలో సప్తమి ఆదివారం రోజునా, పాండవ తీర్థంలో వైశాఖమాసంలో, అలాగే చైత్రమాసంలో పౌర్ణమి రోజు ఆకాశ గంగలోనూ, ఇక కుమార తీర్థంలో మాఘశుద్ధ పౌర్ణమి మధ్యాహ్న సమయంలోనూ, అలాగే కపిల తీర్థంలో కార్తీక శుద్ధ పౌర్ణమి మధ్యాహ్నం స్నానం చేయటం ద్వారా సత్ కోరికలు సిద్ధిస్తాయి. ఇక స్వామిపుష్కరిణిలో ఎప్పుడైనా, ఏ తిథిలోనైనా సరే స్నానం చేస్తే సత్ఫలితం సిద్ధిస్తుంది.

## బుధుడెవరు?

■ యజ్ఞం చేస్తున్న తన ఇంటికి వచ్చిన బృహస్పతి భార్య తారను తన అందంతో కట్టి పడేసి ఎన్నో రోజులు ఆమెతో గడిపాడు చంద్రుడు. తార వల్ల దేవదానవుల యుద్ధం కూడా జరిగే పరిస్థితి వచ్చింది. బ్రహ్మదేవుడు శాంతించమని చెప్పి, తారని బృహస్పతి వద్దకు పంపటంతో ఆ మహా రణం ఆగింది. అలా చంద్రునికీ, తారకూ జన్మించిన వాడే బుధుడు. అందుకే పరస్త్రీ వ్యామోహం గలవారిని బుధుడు కరుణించడు.

**నిరంతర శ్రమ ద్వారా ధనం, సౌఖ్యం రాదు. నిరంతర పూజలూ, యాగాలూ ద్వారా సొమ్ము, సుఖాలూ రావు. పని చేస్తూ పరమాత్మను పూజిస్తే, స్మరిస్తే ధనం గట్టు తెగిన వరదలా వస్తుంది.**

## ఫలితం ఆశించకుండా పనిచేయద్దు

■ పూర్వము ఓ పరమ భాగవతోత్తముడు ఆ వూరి జనాలకి ధర్మం, ఆచారాలు, జ్ఞానం గూర్చి బోధిస్తుండేవాడు. ఏదన్నా డబ్బు ఇస్తే తీసుకునేవాడు కాదు. అడిగేవాడూ కాదు. ఆ విషయాన్ని గ్రహించి భార్య కూడా ఏమీ చెప్పలేకపోయేది. ఆ భాగవతోత్తమునికి రామేశ్వరం, కాశీలకి వెళ్ళాలన్న సంకల్పం వుండేది. కానీ ద్రవ్యం లేకపోవటంతో ఆ కోరికను మనసులోనే అదిమి పెట్టుకునేవాడు. తనకి ధన రూపేణా ఇబ్బందులున్నా సర్దుకున్నాడు. ఆ భార్య ఆగలేక, భర్తకి ఎదురు చెప్పే దోషం తగిలినా పర్వాలేదనకుని చెప్పింది. "స్వామీ.. రామేశ్వరం వెళ్ళి ఈశ్వరుణ్ని సేవించి ఇసుకని మూటకట్టుకోవాలి. రామేశ్వరాన్ని సేవించాలి. ఆపై ఇసుకను తీసుకెళ్ళి గంగలో కలిపి స్నానం చేసి గంగనీరు తీసుకుని కాశీ విశ్వేశ్వరుణ్ని దర్శించి ఆపై మళ్ళీ రామేశ్వరం వచ్చి రామేశ్వరుణ్ని గంగాజలంతో అభిషేకించితే ఈ సకల భూమిపైనున్న తీర్థ పుణ్యక్షేత్రాల దర్శనం పొందిన ఫలం. కాన ధనం కావాలి గదా..... మీరలా ఉచితంగా పని చేస్తూ ప్రతిఫలం ఆశించకపోతే ఎలా..." అంది. అప్పుడు గాని ఆయనకు అవగతమవలేదు. నేను చెప్పేది చేసే ప్రతి పనికీ డబ్బు అడగాలని కాదు. ఏ వృత్తిలో అయితే మీరున్నారో అ వృత్తిని ఉచితంగా చేయద్దు. పోనీలే.. పాపం.. పేదవాళ్ళు.. అనుకుంటే కష్టపడేదీ, బాధపడేదీ మిమ్మల్ని నమ్ముకున్నవారే. వాళ్ళని బాధపెట్టి అశ్వమేధ యాగం చేసినా ఫలితం శూన్యం. మీ వృత్తిలో పనికి తగ్గ ఫలాన్ని ఆశించడం వల్ల సూర్యుడి శుభ దృష్టి వల్ల కలిగి రాజయోగం పడుతుంది. చంద్రుడు కలిగించే రాణియోగం మీ భార్యకి మాత్రం వద్దా.





## ధనం ఎంతటి శక్తివంతమైనదంటే

■ ఓ సందర్భంలో కొంత మందితో కలిసి మాట్లా డుతున్నాను. అందులో ఒకతను ఎదురున్న వ్యక్తిని చూపించి 'ఆహా నిజంగా స్నేహమంటే వీడిదే. మార్కెట్‌లో ధర పదిరూపాయిలుంటే.. ఆరు రూపాయిలకి ఇప్పించాడు. ఎంత మందిని అడిగినా ఆ ధరకి రాదన్నాడు. స్నేహంలో ధనం ఆశించలేదు' అన్నాడు. నేను కూడా అతన్ని ప్రశంసించాను. ఎందుకంటే వస్తువు కొన్న వ్యక్తి వ్యాపారానికి కాదు ఆ వస్తువును ఉపయోగించేది.. దైవకార్యం కోసం. కొంతసేపటికి అతనెళ్ళాక మరో సారి నేను అభినందించాను. ఏమ నుకున్నాడు తెలీదుగాని 'నీ దగ్గరెందుకు దాపరికం. అది పడేది రెండున్నర. నేను ఆరుకమ్మాను' అన్నాడు. అదెలా అని అడిగాను. బియ్యం, పప్పుల్లో క్వాలిటీలు తెలుస్తాయి. కొన్ని వస్తువుల్లో క్వాలిటీ ఎవరికి తెలుసు. నేను ఖంగుతిన్నాను. కారణం వెళ్ళిపోయిన వ్యక్తి వంద, వెయ్యి కాదు పదివేలల్లో కొన్నాడు. దానికి కాదు నేను ఖంగుతింది. స్నేహం పేరుతో అతను చేసిన ఛీటింగ్ తెలుసుకొని. ఆపై మోసపోయిన వ్యక్తి కలిసినప్పుడు జ్ఞానం కోసం గురువును అనగా బృహస్పతిని పూజించమనీ, శ్రీమహాభారతం చదవమని చెప్పాను.

**తీవ్రమైన నష్టం కలిగించిన వారికి నీవు కష్టం... నష్టం కలిగించవచ్చు. అయితే అది పక్కవారిని అనగా ఇతరులను బాధించకూడదు.**

**- రాహువుతో పరమేశ్వరుడు**

## అవి మానేస్తేనే సకల భోగాలను అనుభవించగలరు

■ ఆలోచనని తుంచేదీ, సామర్థ్యాన్ని తగ్గించేదీ, కడుపు నిండా తిననీయకుండా చేసేదీ.. అందమైన అనుభవాన్ని అనుభవించాలంటే మాటల ద్వారా మాత్రమే చేయించేదీ, ఆవేశంగా అనాలోచితంగా నిర్ణయాన్ని తీసుకునే స్థితికి తెచ్చి అనేక ఆర్థిక నష్టాలనూ, అవమానాలనీ చవి చూపించేది, పగనీ, ప్రతీకారాన్నీ పెంచి ఆర్థికంగా, సామాజికంగా మిమ్మల్ని మీకు తెలియకుండానే దిగజార్చేదీ... మిత్రులనీ, బంధువులనీ దూరం చేసేదీ ఏదయినా సరే ఓ స్టేజీలో మాట్లాడటానికే తప్పు చెయ్యగలిగే సకల శక్తులనీ హరించేదీ అయిన అవి మానేస్తేనే ధనం తాలూకూ భూమిపైనున్న అసలు సిసలు సుఖాలను అనుభవించగలరు.... అవి ధన రూపేణా స్త్రీని పొందటం.. ఇంకా మద్యం.

## కష్టంలో కనుచూపు మేరలో ఒక్కడు కూడా వుండడు

■ ఆహా.. ఓహో... నీ అంతవాడు లేడు.. నువ్వేంచెబితే అది.. ఎక్కడికి రమ్మంటే ఏ సమయంలో రమ్మంటే అక్కడికి రావటానికి సిద్ధం. అవన్నీ మీరు బాగున్నప్పుడు... జేబులో రూపాయి ఉన్నప్పుడు. అదే మీరు సమస్యల్లో మునిగి పోయారా.. తుపాకి గుండుకి కూడా దొరకరు. అంత వరకయితే పర్వాలేదు. టప.. టప.. తలా ఒకరాయి వేస్తారు. ఆ సమయంలో ఎవ్వర్నీ దగ్గరికి రానీయకుండా మీ స్వంత ఆలోచనలతో సమస్యని పరిష్కరించుకోండి. మళ్ళీ అంతా మీ ముందు క్యూ కడతారు.





## ఎక్కడయినా బావే గాని...

■ ఆ పాత సామెతలో ఎంతో పరమార్థం ఉంది. బావ అని వంగతోట దగ్గరికెళితే కావాల్సినన్ని వంకాయల్ని ఇస్తాడు. అందులో సందేహం లేదు. దాని బదులు మరదలని మరొకటి అడుగుతాడు. కాసేపు మరదలి విషయం పక్కన పెడదాం. అందులో నిజపరమార్థం డబ్బు దగ్గర తన పర బేధం ఉండదు.. ఉండకూడదు. మీ నుంచి ఎంత సహాయం తీసుకున్నా, ఎంత లాభపడినా, ఎన్నిసార్లు మీ సొమ్ము తిన్నా డబ్బు ఇవ్వాల్సి వస్తే కొద్దిగా ఆలస్యం అయితే చాలు వారి విశ్వరూపం చూపిస్తారు. అవమానం ఇలా చెయ్యొచ్చొని కూడా తెలీదు. తెలియని వారే నయం.. తెలిసిన వాళ్ళతో డబ్బు దగ్గర మహా ప్రమాదం. కాన దగ్గరివారితో డబ్బు సంబంధాల విషయంలో జాగ్రత్త. పరిస్థితి బాగోలేనప్పుడు ఓ పాడి ఆవును ఇప్పించమని అడిగితే అవమానించాడు. అవమానం భరించలేక ఆ గురువు తన శిష్యుడైన అర్జునుడితో ప్రతీకారం చేయించాడు. మనం అంతటి గురువుకాకపోయినా.. అవమానం తీర్చటానికి అర్జునుడు లాంటి శిష్యుడు ఈ రోజుల్లో లేడు.

**అష్టమి కష్టం, నవమి నష్టం.. ఇవి జ్యోతిష్య శాస్త్రంలో లేవు. కానీ మన పూర్వీకులు చెప్పారు. అష్టమి రోజు పని ప్రారంభిస్తే అష్టకష్టాలొస్తాయి. నవమి రోజు ప్రారంభిస్తే మహా నష్టాలు. తార్కికం వదిలేసి మన పెద్దలు చెప్పారని ఆచరిస్తే మంచిదేగా కష్టాలు, నష్టాలు దరిచేరవు.**

## ఇలాంటి వారితో తిరిగితే...

■ ఇంట్లో వెండి కంచం తాకట్టు పెట్టే వారితో తిరిగితే ఏనాటికైనా మీరూ అదే చెయ్యాల్సి వుంటుంది.

■ వ్యసనాలున్న వారితో తిరిగితే ఎనాటికైనా ఏదో వక వ్యసనం తగిలించుకోక మానరు.

■ చెడు ప్రవర్తన గల వారితో తిరిగితే మీరూ చెడిపోయారనే మాటలు మామూలే. అయితే ఏదో ఒక స్థాయిలో మిమ్మల్ని ఆ దారిలోకి తీసుకెళ్తారు.

■ గౌరవం లేని వారితో తిరిగితే మీరెంత గొప్పవారైనా మీకూ అగౌరవం తప్పదు.

■ భార్యనీ, సోదరులనీ, మిత్రులనీ మోసం చేసే వారితో తిరిగితే మీకూ ఏదో ఒకరోజ వారి చేతిలో మోసం తప్పదు.

■ ధర్మ, భక్తి, న్యాయ మార్గాల్లో వున్న వారితో తిరిగితే మీకు ధనం, ఆయుష్షు, ఆరోగ్యం వృద్ధి అవుతాయి.

■ శీలం అమ్ముకునే వారితో తిరిగితే ఏదో ఒక రోజు మీకూ ఆ పరిస్థితి తప్పదు.

■ ఈశ్వరుడు రావణుడి తమ్ముడు కుబేరుడితో స్నేహం చేశాడు గానీ అన్న దశకంఠుడితో కాదు.

## దివ్యస్నానం...

■ సూర్యుడి వెలుగు వుండగా వర్షం పడుతుంటే ఆ వర్షంలో చేసే స్నానం మహా దివ్యస్నానం. దాంట్లో తడవండి. ఫలితం కోసం చేయద్దు. ఆ స్నానం ఇచ్చే ఫలితం రాయటం నా వల్ల కాదు.





## ఏ గ్రహాన్ని పూజిస్తే ఏమి ఫలం

■ సూర్యుడు... రాజయోగం, ఉన్నత స్థితి.

చంద్రుడు... సుఖాలు, స్త్రీ సాంగత్యము.. కీర్తి తెచ్చే సంతానం.

కుజుడు.. శక్తి, పట్టుదల, అహం.

బుధుడు... కార్యదీక్షణ, సంకల్పము.

రాహువు... మీ చుట్టూ వున్న వారికి అనగా మిమ్మల్ని నమ్ముకున్న వారికి సుఖాలూ లేదా కష్టాలు.

కేతువు .... ఊహించని సంఘటలను తట్టుకోలేకపోతే జీవితాంతం వెనక్కి వెళ్ళిపోవటమే. విపరీత పరిస్థితులు వచ్చినప్పుడు కలవరపడకూడదు.

బృహస్పతి.. భుక్తి, భక్తి.

శుక్రుడు.... ఆకస్మిక ధనం, సౌఖ్యం, విలాసాలు.

శనీశ్వరుడు.... మీలోని శక్తికీ, యుక్తికీ, ఆత్మవిశ్వాసానికీ పరీక్షలు పెట్టడం.

**మానవ జన్మ తినటానికీ, ధనం సంపాదించటానికీ, అనుభవించటానికే కాదు సృష్టించింది. మోక్ష గుండం విశ్వేశ్వరయ్యలా, శ్రీనివాస రామానుజంలా, కాటన్ దొరలా.. ఇలా చెప్పకుంటూ పోతే ఈ పుస్తకం చాలదు. వారిలా ఏదో ఒకటి ఇదిగో ఇది చేశాను అని చెప్పకునేలా పనిచేయాలి. మంచి చేయాలి. హిట్లర్, ముస్సోలినీ...లలా చెడుని కాదు.**

## చేసే వాళ్ళయితే వెంటనే చేస్తారు

■ ఎంతో నమ్మకంగా ఏదో సమయంలో మన అవసరార్థం సహాయం అడుగుతాం. అది డబ్బు కావచ్చు లేదా మాటసాయం కావచ్చు. అలా అడిగినప్పుడు అవతల వారు వెంటనే చేయకపోతే.. రేపు అంటే పర్వాలేదు. రేపు... రేపు.. కిరాణా కొట్టులో లాగా అప్పు రేపులా అయితే.. వెంటనే వాళ్ళని దూరంగా ఉండండి. ఎంత వరకో అంత వరకే. లేదంటే రేపొద్దున అంతకు మించిన సమస్య వస్తే మరింత ఘోరంగా నష్టపోవాల్సి వస్తుంది. అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలని వూరికే అనలేదు పెద్దలు. కాదంటే, చేయలేమంటే వేరే దారి చూసుకుంటారు మీరు. అంతే గాని 'రేపు' అనే వారితో మీరు మరింత వూబిలోకి దిగిపోతున్నారని గుర్తించండి. అవుతుందా? లేదా? అంతే.. రెండే మాటలు.

## గోవు తోకతో దిష్ఠి తీస్తే

■ చిన్న పిల్లలు నిద్రలో ఉలిక్కి పడటం... ఇంకా అనేక వాటి తీవ్రగ్రహ దోషాలు పోవాలంటే గోవు తోకతో మూడు సార్లు దిష్ఠి తీయాలి. రేపల్లెలో బాలశ్రీకృష్ణుణ్ని చంపటానికి రాక్షసులు వచ్చినప్పుడు శ్రీకృష్ణుడు దాన్ని సంహరించాడు. అయితే పరమాత్మ మహత్యం తెలియని యశోద, గోపికలు అంత పెద్దగండం గడిచినందుకు శ్రీకృష్ణుడ్ని గోశాలకి తీసుకెళ్ళి ఆవుమూత్రం చల్లి గోమయం అద్ది గోవు తోకతో దిష్ఠి తీసి ఊపిరి పీల్చుకున్నారు. పసిపిల్లలకి అలా దిష్ఠి తీస్తే శుభకరం. పైగా వారికి మహర్దశ కూడా పడుతుంది.





## ఇంటి ఇల్లాలు ఎంత చేసినా...

■ పూజలూ, వ్రతాలూ, నోములూ, పుణ్యాలూ... అలా ఇంటి ఇల్లాలు ఎన్ని చేసినా కొంతమందికి ఏదీ కలిసిరాదు. దానికి కారణం భర్త అధర్మ ప్రవర్తన, అశుభ్రత. శుచీ శుభ్రతతో, ధర్మ ప్రవర్తనతో సాగే ఇల్లాలిను చూసి దోషాలన్నీ ఆ గృహాన్ని వదలటం ఇష్టంలేక దారి వెతుక్కుంటాయి. అప్పుడు వారికి కనపడేదారి గృహయజమాని గోళ్ళు. మట్టి రూపంలో అక్కడ చేరి భద్రంగా వుండి తమ పని తాము చేసుకుపోతాయి. మూడు పూటలా భోజనం, ధన లెక్కలు.. నిత్యస్నానాలు.. అన్నీ గుర్తుంచుకున్నట్టే, వాళ్ళ గోళ్ళ గురించి అందులోని మట్టి గురించి కూడా పట్టించుకుంటే పూర్తి దోషాలు గృహం నుంచి పారిపోతాయి. మీ ఇల్లాలు చేసే పూజలూ ఫలిస్తాయి. అనారోగ్యాన్ని తన వక్రదృష్టితో ఇచ్చే చంద్రుడు శుభదృష్టితో ఆరోగ్యాన్ని కూడా ఇస్తాడు.

**ఆడపిల్లకి పుట్టింటి నుంచి చెయ్యాల్సిన సకల పెట్టుపోతలు జరగకపోతే అన్నదమ్ములకి కలిసిరాదు. గృహంలో నవగ్రహ శాంతి చేయించినా పీడలూ బాధలూ తొలగవు. అలాగే అన్నదమ్ముల ధనాన్ని అధర్మ పద్ధతిలో ఆశిస్తే ఆ ఆడపిల్లలకి సుఖసంతోషాలు వుండవు. ధనమెంత వున్నా శని తన విశ్వరూపాన్ని చూపిస్తూనే వుంటాడు.**

## దేవాలయాల్లో ఎంత పవిత్రంగా ఉండాలి

■ భగవంతుని పూజలప్పుడూ, దర్శనమప్పుడూ మనసు ప్రక్క వైపులకు పోతుంది. సుఖాలకి కారణమయ్యే శుక్రుడు హీనమైన వాంఛలనూ, చర్యలనూ ప్రేరేపిస్తుంటాడు, పరీక్షిస్తుంటాడు. అలాంటివి మాని చిత్తం భగవంతుని మీదే ఉంచాలి. అలా ఉంచక పక్క చూపులూ, చేయకూడని పనులు చేస్తే సృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ని దర్శించడానికి వచ్చిన గంగ, మహాభిషుడులా మహాశాపానికి గురవ్వాల్సి వస్తుంది. దైవసన్నిధిలో కామపు పనులు చేసినందుకు ఇద్దర్నీ మానవ లోకంలో జన్మించమని శపించాడు బ్రహ్మ. అదే మానవుల కయితే నవగ్రహాలను అశుభ వీక్షణలతో అతలాకుతలం చేయమన్నాడు. ఆలయ క్యూలలో స్త్రీ స్పర్శ ఆనందాన్ని పూర్తిగా తగ్గించండి. ఇప్పుడు కెమారాలు కూడా వున్నాయి.

## ఓ కుటుంబాన్ని పుణ్యక్షేత్రానికి పంపండి

■సంతానానికి సంబంధించిన అనేక కార్యాలు అవ్వక పోతుంటే ఇంట్లో పూజామందిరంలో పూజ చేసి ఆపై అవ్వాల్సిన కార్యాన్ని స్వామికి విన్నవించాలి. ఆ కార్యము కనుక ఫలిస్తే ఓ కుటుంబాన్ని తిరుపతి, బాసర, మధుర వంటి పుణ్యక్షేత్రాలకి తమ ఆర్థిక పరిస్థితిని బట్టి పంపుతామని మొక్కుకోవాలి. మొక్కుకోవటం వల్ల ఆ కార్యం త్వరగా ఫలిస్తుంది. తీర్థయాత్రలు చెయ్యటం... కొండలెక్కటం, నడటం.. చేసినా, చేయించినా శని ప్రీతి చెందుతాడు.





## నీరూ, తిండీ విషయంలో దోషం చేయద్దు

■ అల్పాహారం లేదా భోజనం బైట తినాల్సి వచ్చినప్పుడు సరదాగానో, పని ఒత్తిడివల్లనో, కావాలనో తిన్నదాన్ని తగ్గించి చెప్పటం మహా దోషం. ఆ రోగం అనారోగ్యంగా పరిగణిస్తుంది. అలాగే నీటి యందు ఎలాంటి దోషం చేసినా, అనగా నీటిని వృధా చేస్తున్నా ఆ పాపం మహా శాపంగా మారుతుంది. కనులు తిరిగి పడినప్పుడు నీటిని చల్లుతారు. దేనికి.. నీరంటే ఈశ్వరుడు. పోయిన ప్రాణాలనూ, పోతున్న ప్రాణాలనూ తిరిగి తేగలిగే శక్తి నీటికే ఉంది. అందుకే ఋషులు, మునులు, తాపసులు శాపం పెట్టేటప్పుడు కమండలం లోంచి నీరు తీసుకుని సంకల్పించి చల్లి మరీ శాపం పెడతారు. వరం కూడా అలాగే ఇస్తారు. నీరు ఎంత శుభం చేస్తుందో, తేడా చేస్తే అంతటి నాశనాన్ని కూడా కలిగిస్తుంది. అందుకే మన పూర్వులు స్నానమప్పుడూ, కాళ్ళు కడుక్కునేటప్పుడు కాలిపై కాలు వేసి రుద్దరు. నీరు అనే దైవశక్తిని కాళ్ళతో రుద్దటం ద్వారా దోషం కలుగుతుందని అలా చేయరు. మొన్న పెళ్ళికి వెళ్ళి వచ్చాం, తీర్థయాత్రలకి వెళ్ళి వచ్చాం.. నీళ్ళు పడలేదు అంటుంటారు. అంటే అర్థం నీరు శపించిందన్న మాట. శాపం అంటే మహా బాధ, వ్యధ. అంటే నష్టం. నష్టమంటే ధనంతో పాటు అన్నీ... నీటినీ, ఆహారాన్నీ భంగం చేస్తూ శనీశ్వర వ్రతాలు చేసినా ఆయుష్షును ఇవ్వడు. అశుభదృష్టితో ఆయుష్షును తగ్గిస్తాడు.

## దైవశక్తి లేకపోతే

■ ఎంతటి ధనమున్నా, అధికారమున్నా దైవబలం లేక పోతే సర్వమూ కోల్పో వాల్సిందే..... ధ్రువసంధి పరమ ధర్మనిరతుడు. మహా వీరుడు. సామ్రాజ్య అధినేత. సకల సైన్యమూ తన వెంటవున్నా, దైవం అనుకూలించకపోవటంతో ఓ సింహం బారిన పడి భార్యనీ, పుత్రుల్నీ అనాధల్ని చెయ్యాల్సి వచ్చింది.... ధ్రువ సంధి పుత్రుడు సుదర్శనుడు సకల సంపదలూ, రాజ్యమూ పోయి అడవులపాలయినా ఆ తల్లిని ఆ జగదంబికను స్మరించి, పూజించి మహా చక్రవర్తిఅయ్యాడు.

పూజ, వ్రతం, యజ్ఞం మహాశక్తివంతము. సీతా వియోగంతో శ్రీరాముడు దీనావస్థలో ఉన్నప్పుడు నారదుని మాటలతో శ్రీదేవీయాగం చేసి మహాశక్తివంతుడయ్యాడు. రావణుడ్ని వధించాడు. శ్రీరామచంద్రుడు శ్రీదేవీ నవరాత్రి వ్రతాన్ని చేశాడు. ఆ వ్రతప్రభావం వల్ల సర్వసిద్ధులనూ, శక్తులనూ కరతలామలకము చేసుకున్నాడు. నవగ్రహాలని ప్రతిష్ఠించాడు. కష్టాలున్నప్పుడే దేవుడు కాదు సుఖాలప్పుడు కూడా తలచుకోండి. వీలు చూసుకుని శ్రీదేవీభాగవతమును భక్తితో, ఇష్టంతో చదవండి. కనీసం మీ భాగస్వామితోనయినా చదివించండి.

## కోపమే ప్రథమ శత్రువు

■ మహాతపస్సు చేసినవారూ, బ్రహ్మర్షులూ అయిన వశిష్ఠ విశ్వామిత్రులు అహంవల్లా, కోపం వల్లా ఆడి, బకల జన్మములెత్తి వేలసంవత్సరాలు కొట్టుకున్నారు.





## ఇంద్రియ నిగ్రహమంటే?

■ తపః ప్రాంతమైన బదరికావనంలో మహా తపస్సు చేస్తున్న నరనారాయణుల మహా తపస్సును భంగం చెయ్యటానికి ఇంద్రుడు అప్సరసల్నే కాక మన్మథుణ్ని సహితం పంపాడు. వారి వల్ల కాకపోవటంతో, పదహారు వేలమంది మహా అందగత్తెలని పంపి వారి తపస్సుకి విఘ్నం కలిగించ మన్నాడు.... అయినా నారాయణుడు మనో నిగ్రహంతో పదహారు వేలమందినీ తిరస్కరించాడు. ఒక్కసారి ఆ సన్నివేశాన్ని కనులు మూసుకుని ఊహించుకోండి..... అంతమంది అందగత్తెలని వదులుతారా...? శ్రీమహావిష్ణువు మాత్రం తిరస్కరించాడు. అందుకే లోకానికి నాయకు డయ్యాడు... లోకాల్ని పరిపాలిస్తున్నాడు.

## ధన సాధన... ధ్యాన సాధన

■ ధ్యాన సాధనలో తొలుత శరీరానికి సమస్యలు.. నిద్రమత్తు, కోపం, ద్వేషం, బద్ధకం, అసహనం, చికాకులు వస్తాయి. వాటిని అధిగమించి సాధన చేస్తే అపూర్వమైన ధ్యాన ఫలం అందుకోగలము. ధన సంపాదనా అంతే. ప్రారంభంలో అసూయ, కష్టాలూ, పోరాటాలూ, ఆవేశాలు తప్పవు. లౌక్యంతో వాటిని జయిస్తే ధన సంపదలే.

## రాహుకేతువులకి ప్రీతి కలిగించండి

■ ఎండాకాలం మీ మిద్దె పైనో.... డాబా పైనో .... పాత్రలో నీరు పోసి ఉంచండి. పక్షులు అనేకం ఆ నీటిని త్రాగుతాయి. రాహుకేతువులకి తాగే పదార్థాలన్న ప్రీతి. అలా చెయ్యటం వల్ల.. మీకు శత్రువులని వంచే శక్తినిస్తారు.

## బ్రహ్మ రంధ్రమంటే...
## - ఐతరేయం

■ సృష్టిలో మొదట ఆత్మ వుంది... లోకంలో వెలిగి పోవాలనుకుంది. ఆ వెంటనే సప్తలోకాలు.. లోకపాలకులు.. సృష్టించబడ్డాయి. ఆకారం, కళ్ళు, చెవులు ముక్కులు.. చర్మం.. హృదయం జనియించాయి. పంచప్రాణాలు.. పంచ భూతాలు.. అన్నీ ఏర్పడ్డాయి. ఆకాశం.. గాలి.. నిప్పు.. నీరు.. మట్టి వాటికి తగ్గ చోటులను చూసుకున్నాయి.

అగ్ని నోటిలో ప్రవేశించింది. వాయువు శ్వాస రూపంలో మనస్సును చేరుకుంది. దిక్కులు శబ్దరూపంలో చెవులకి చేరాయి. ఓషధులు రోమరూపంలో చర్మంలో చేరుకున్నాయి. ఇక చంద్రుడు మనోరూపంతో హృదయంలో ప్రవేశించాడు. సూర్యభగవానుడు కనులలో చేరాడు. అలా మానవ శరీరం నిర్మత మైయ్యింది. అన్నీ బాగానే వున్నాయి. మనిషి బ్రతకాలంటే తినాలి. తినాలంటే నోరు కావాలి. ముక్కు, చెవులు, కళ్ళు ఇత్యాదికి ఆహారం తీసుకోవటం రాదు. దాంతో నోరు ఏర్పడింది. ఆత్మకు శరీరంలో చోటు దొరకలేదు. ఎటువైపు నుంచి శరీరంలోకి వెళ్ళాలో అర్థం కాక చివరకు తల మాడులో చిన్న రంధ్రం చేసుకుని ఆ రంధ్రంలోనుంచి లోపలకి ప్రవేశించింది. అదే బ్రహ్మరంధ్రం.

## స్త్రీని పదిసెకనులే చూడాలి

■ ఆ పదిసెకనులు కూడా ఆమె ఎవరో తెలుసుకోవటానికే. పదకొండవ సెకను చూస్తే మనసు ఆ అందమైన స్త్రీని ఆశపడుతుంది. మనసు ఆశపడితే ప్రవర్తన మారుతుంది. ప్రవర్తన మారితే ధన, మానాలకి నష్టం.





## మోహమే అసలు సిసలు శత్రువు

■ మహాశక్తివంతుడూ, బ్రహ్మవరాలున్న వాడూ అయిన మహిషుడు కేవలం స్త్రీ కోసము కలవరించాడు. మహాశక్తితో పోరాడుతున్నా వాని ధ్యాసంతా ఆ తల్లి అందాల మీదే వుంది.

కేవలం ఆ వ్యామోహానికే అంతటి వరాలున్న వాడు కూడా ఆదిపరాశక్తి చేతిలో మరణించాడు. స్త్రీ వ్యామోహమే రాక్షశాంస. ఆ స్త్రీ వ్యామోహంతోనే ఇంద్రుని భార్య శచీదేవిని ఆశించి పాములా జన్మించాల్సి వచ్చింది మహిషునికి.

## వైకుంఠ వాసుడు సహితం భార్యపై కోపాన్ని ప్రదర్శించాడు

■ శ్రీమహాలక్ష్మి తన సోదరుడిని చూసిన ఆనందంలో మైమరిచి వుండి తాను పిలిచినా పలకలేదని ఆగ్రహించి ఆడగుర్రంగా మారమని శ్రీమహాలక్ష్మిని క్షీరసముద్ర రాజ తనయుని శపించాడు వైకుంఠవాసుడు. ఆ శాపకారణంగానే ఆడగుర్రంగా మారి వున్న భార్య దగ్గరికి హయగ్రీవుడిగా అవతరించి భార్యని చేరి తన కోపాన్ని క్షమించమన్నాడు. మళ్ళీ లక్ష్మీదేవిని వైకుంఠానికి తెచ్చుకున్నాడు. భార్య మీద అరవటమే కాదు... తిరిగి లాలించాలి కూడా. అప్పుడే ఆ గృహం వైకుంఠం.

**కార్యవీర్యార్జున మంత్రం పఠిస్తే పోయిన ధనం తిరిగి వస్తుంది. పూర్వం ఈ మంత్రాన్ని డబ్బు ఎగ్గొట్టడానికి కూడా పఠించేవారు. అలాగే కాశీ కెళ్ళి గంగలో మునిగితే పోయిన డబ్బు, చేజారిన డబ్బు, రావాల్సిన ధనం తిరిగి అందుతుంది.**

## ముత్తాతల కాలం అంటే ఇదే

■ ఇప్పుడు మీరుండే ఇంట్లో ఇరవై కాపురాలు వుండేవి.

■ నలభై యేళ్ళకే ముసలితనం.

■ వరి అన్నం తినాలంటే ఆరు నెలలకోసారి.. అప్పట్లో రంగూన్ నుంచి బియ్యం వచ్చేవి.

■ పెళ్ళిలల్లో వేసేది ఒకే ఒక స్వీట్... అది బియ్యం, బెల్లాలతో చేసే అతిరసం.

■ బస్సులు లేవు, రోడ్లు లేవు, దీపాలు లేవు.

■ రాత్రి పడుకున్నాక దుప్పటి విదిలిస్తే గుప్పెడు మట్టి పడేది.

■ వ్యాధి ఏదైనా వచ్చిందంటే పోవటమే.

ఇప్పుడు మనం అనుభవించేదే స్వర్ణయుగం.

## మీ నాన్నకి ధనముందని మిడిసి పడద్దు

■ కోట్లలో వ్యాపారం చేసిన వారి పుత్రులెలా వున్నారో మీ చుట్టూ వున్న వారిలో గమనించండి.

■ అంత సంపాదించారంటే వారిలో అనంతమైన శక్తి వుండి వుంటుంది.

■ కార్వేటి రాజుకు 120 గ్రామాలున్నాయి. తిరుత్తణి గుడి కట్టించింది ఆయనే. ఆయన సంతానం పరిస్థితి తెలుసుగా. అంతకన్నా డబ్బు మీ తండ్రి, తల్లి దగ్గర లేదుగా.. స్వయం శక్తితో సాధించండి. తండ్రి, తల్లి ఆస్తులు చూసుకొని స్థిమితంగా వుంటే భవిష్యత్తులో భయంకర కష్టాలు తప్పవు. నవగ్రహాలు శుభ దృష్టితో చూసినా ధనం మాత్రం అలాంటి వారికి రాదు.





## తీర్థాలు సేవిస్తే ఎలాంటి ఫలం కలుగుతుంది

■ రైతు వ్యవసాయం చేస్తే ధాన్యం వస్తుంది. దాని వల్ల అతను సుఖాన్ని పొందుతాడు. అదే విధంగా తీర్థయాత్రలు చెయ్యటం ద్వారా మహాసుఖాలనిచ్చే పుణ్యం వచ్చి పాపాలు నాశనమవుతాయి. ఈర్ష్య, అసూయా రాగద్వేషాలే పాపాలు. వాటివల్లే మనుజుడు పాపాత్ముడు అవుతాడు. తీర్థసేవనం ద్వారా పాపాలను పోగొట్టుకోవాలి.

## ధనమున్న వాడికి కష్టాలు ఎందుకు వస్తాయి

■ నీటిలో వుండే చేపలను ఆకాశంలో తిరిగే పక్షులు అదను చూసి, గురి చూసి కొట్టి ఎలా భక్షిస్తాయో, అలాగే ధనమున్న వాడిని అయిన వారన్న పేరుతో చుట్టూ చేరి వాడ్ని దారి తప్పిస్తారు. శోకాన్ని కలిగిస్తారు. పీడిస్తారు. కుదరకపోతే అపహరిస్తారు.

**ఆత్రేయ మహర్షి పౌత్రుడూ, చంద్రుని పుత్రుడూ అయిన బుధుడు ఇష్టవివాహం, శుభాన్నీ కూడా ఇస్తాడు. 'ఇల'ని అలాగే ప్రేమించి వివాహం చేసుకున్నాడు. ఇష్టమైన వార్ని జీవిత భాగస్వామిగా పొందటానికి బుధ స్తోత్రం పఠించి తొమ్మిది రోజులు నవగ్రహ ప్రదక్షిణలు చేయండి. బుధుడు తను పడిన బాధ ఏ దంపతులూ పడకూడదని తనని స్తోత్రించిన వారికీ, పూజించిన వారికీ అన్యోన్యదాంపత్యాన్ని అందిస్తాడు.**

## రాహువు మంత్రం జపించండి

■ రాహు గ్రహ వీక్షణ సరిగా లేకపోతే మహాకష్టాలు దాపురిస్తాయి. ఆలోచనలు దారి తప్పి అధో స్థితికి తీసుకు వెళ్తాయి. వెళ్లకూడని చోటికీ.. అర్హత లేని వారి ముందు మోకరిల్లాల్సి వస్తుంది. హరిశ్చంద్రుడంతటి వాడు రాహు గ్రహ వీక్షణలకి మహా కష్టాలు పడ్డాడు. అట్టి రాహువు శుభదృష్టి కలిగితే మహాకీర్తి. దానికోసం 108సార్లు తొమ్మిది రోజుల 'ఓం రాహువేనమః' అని జపిస్తూ నవగ్రహ ప్రదక్షిణలు చేయాలి.

## వీరి దగ్గరిది తాత్కాలిక సుఖమే..

■ ఒక నీచునికి అనుకోకుండా దేవుని దయవల్ల సంపద వస్తుంది. వాడు దుర్మార్గుల్ని చేరదీస్తాడు. వాళ్ళకే సాయం చేస్తాడు. ఇష్టమొచ్చినట్టు చెడు తిరుగుళ్ళు తిరుగుతాడు. అహంకారంతో అంతకుముందున్న తన హీన స్థితిని గుర్తించడు. మంచివాళ్ళను ద్వేషిస్తూ వుంటాడు. అట్లాంటి వాడి దగ్గరికి వెళ్ళిన ఎవరికీ సుఖ శాంతులుండవు అని భర్తృహరి సుభాషితం.

## జాతి బుద్ధిని దైవం కూడా మార్చలేడు

■ శ్రీమహావిష్ణువు భక్తుడు ప్రహ్లాదుడు. అతని తండ్రి హిరణ్యాకశ్యపుడిని నారసింహావతారమెత్తి సంహరించి సకల దానవ రాజ్యాన్ని ప్రహ్లాదునికి కట్టబెట్టినా, ప్రహ్లాదుడు శ్రీ ఆదిపరాశక్తితో శ్రీమహావిష్ణువు గూర్చి అనేక నిందారోపణలు చేశాడు. కాన జాతిబుద్ధి ఏం చేసినా మారదు. మారినా అది తాత్కాలికమే.





## మహర్జాతకులైన సంతానం కావాలంటే

■ సంతానం వల్లే వంశం తరిస్తుంది. అట్టి సంతానము పుణ్యం వల్ల కలుగుతుంది. దాన, నియమ, క్షమ, శౌచ, అహింస అను పంచయజ్ఞముల ద్వారా పొందలేనిది ఏదీలేదని శ్రీలక్ష్మీపురాణం తెలవిస్తోంది. పుణ్యకర్మల వల్లే సంతానమైనా, ధనమైనా లభిస్తుంది. ఆ పుణ్య యజ్ఞం ద్వారా కన్నా తల్లి తండ్రిని పూజించటం ద్వారా, సేవించటం ద్వారా ఎన్నో రెట్ల ఫలం కలుగుతుందని భూమి ఖండంలో వుంది.

**- పద్మపురాణం ఆధారంగా.**

## ధనం, కీర్తి సంపాదించలేకపోవటానికి కారణాలు

నేను చేయగలనా? నా వల్ల కాదేమో..... చేస్తే ఓడిపోతానేమో.. నాలుగోదీ, ముఖ్యమైనది స్త్రీ వ్యామోహం.. ఈ నాలుగే ధనవంతుడ్ని, కీర్తివంతుడ్ని కాకుండా చేస్తాయి. నాలుగు కారణాలు వుంటే అధమడవుతాడు. రెండు వుంటే మధ్యముడవుతాడు. ఒక్కటుంటే ఏదో రకంగా బ్రతికేస్తుంటాడు. ఈ నాలుగూ వున్న వాళ్ళు ఎప్పటికయినా మారే అవకాశం ఉంది. గొప్పవాళ్ళయ్యే అదృష్టం కూడా ఉంటుంది. కానీ పక్కవాడి గూర్చి నిరంతరం ఆలోచించటం.. అంతకు మించిన దరిద్రం ఈ భూమండలంలోనే లేదు.

**ఓం నమఃశ్శివాయ అని లింగము వద్దే స్మరించాలి. శివుని ప్రతిమ వద్ద ఉచ్ఛరించకూడదు. గర్భ గుడిలోని శివలింగాన్ని స్వయంగా పూజిస్తే ధర్మపరమైన కోరిక వెనువెంటనే సిద్ధిస్తుంది.**

## ఎలాంటి వానికి శరణు ఇవ్వాలి

■ ఆర్తులకు శరణు ఇవ్వటము అనేక యాగాలు చేసిన దానికన్నా ఎక్కువ పుణ్యఫలం. అలాగే భయం చెందేవానికీ, ఎవరి అండలేనివానికీ, దీనుడైనవానికీ అభయం ఇచ్చుట మరింత పుణ్యం. శక్తి వుండీ, చేయగలిగి వుండీ చెయ్యక పోవటం యాగభంగమంత మహాపాపం. పరిస్థితుల వల్ల చేయలేకపోతుంటే పూర్తిగా దూరంగా వుండండి.

## మంచివారితో పగ మంచిది కాదు

■ ధర్మపద్ధతిలో జీవనం సాగిస్తున్నవారితో, వారి పని వారు చేసుకుంటున్న వారితో శత్రుత్వం తగదు. అలా చేస్తే కులనాశనము.

అందునా శక్తిలోనూ, ధనములోనూ తక్కువైన వారితో వైరం ఒక్కోసారి మహా ప్రమాదంగా పరిగణిస్తుంది. దోమవంటి వారని భ్రమిస్తే ఏనుగు, సింహం వంటి వారయినా నాశన మవుతారు.

చిన్నవాడని సుదర్శనుడితో పెట్టుకున్నందుకే మహా కండకావరం గల యుధాజిత్తు సర్వనాశనం అయ్యాడు. తన మనవడిని కూడా పోగొట్టుకున్నాడు. మిత్రులనూ, హితులనూ కూడా కోల్పోవల్సి వచ్చింది.

## అన్నదమ్ములు ఎలా వుండాలి

■ అరణ్యంలో చెట్టు ఒక్కటే వుంటే ఏనుగుల గుంపులు తొక్కేస్తాయి. పెనుగాలి కూల్చి వేస్తుంది. అదే అనేక చెట్లు వుంటే..... అలాగే అన్నదమ్ములు కూడా కలిసి వుంటే ఎవరూ కదిలించలేని శక్తివంతులవుతారు.





## కోపం ఎంతటి వినాశనమును సృష్టిస్తుంది

■ కోపం మహా పాపాన్ని కలిగిస్తుంది...... కర్తవ్యాన్ని విస్మరింప చేస్తుంది. అనరాని మాటలు అనిపిస్తుంది. ధర్మ అర్థకామాలని దారి తప్పిస్తుంది.

చంపటానికీ, చావటానికీ, ఆఖరికి ఆత్మహత్యకు కూడా దారితీస్తుంది. ఆవేశకోపాలు చిన్నా, పెద్దా, గురువు అనే తేడా లేకుండా నిందించేలా చేస్తుంది.

కోపాన్ని జ్ఞానమనే నీటితో ఎప్పుడూ చల్లార్చుతూ ఉండాలి.

## లోభమెంతటి స్థితిని తెస్తుంది

■ లోభి తను సుఖపడకపోగా పక్కనున్న వారికి కూడా సుఖమివ్వడు. ఎంత లోభితనముంటే అంతటి దుఃఖము కలుగుతుంది. లోభం వల్ల వ్యాధులొస్తాయి. దానితో సుఖ మన్నది కరువవుతుంది. లోభం వల్ల భయం కలుగుతుంది. దాని వల్ల ప్రశాంతత పోతుంది. లోభితనం కన్నా నీచమైనది యాచన. మరణం, దుఃఖాల కంటే భయంకరమైనది లోభితనం.

**చాలా మంది ధనం సంపాదించాలని ఉవ్విళ్ళూరుతుంటారు. కానీ కొంతమందే తమ దగ్గరున్న ధనంలోంచి ఒక్కపైసా కూడా నష్టపోకూడదనేలా ప్రవర్తిస్తారు. ఆ చిన్న సూత్రమే మరింత ధనవంతుడ్ని చేస్తుంది.**

## శ్రీదేవీభాగవతం చదవటం ఎంతటి పుణ్యం

■ శ్రీదేవీభాగవతం పద్దెనిమిదివేల శ్లోకాలతో కూడిన మహామహితాన్వితమైనది. అజ్ఞానమనే చీకట్లను పార ద్రోలుతుంది. పరిపూర్ణతత్వం కలుగుతుంది. సుఖాలను కలిగిస్తుంది. ధనాన్నీ, ధాన్యాన్నీ ఇస్తుంది. పుత్రులకూ, మనుమలకూ పూర్ణ ఆయుష్షును కలిగిస్తుంది.

## శాఖాహారం తీసుకోవటంలో విజయ రహస్యం

■ శాఖాహారంలో అమృత గుణం వుంది. ఆ గుణం వల్ల తేజస్సు.. ఆయుష్షు వృద్ధి అవుతాయి.

■ మీరేదన్నా ఓ సంకల్పం పెట్టుకొని అది పూర్తి అయ్యేదాకా మాంసాహారం ముట్టనని పెట్టుకోండి. ఆ కార్యం ఎంత విజయవంతం అవుతుందో తెలుస్తుంది.

■ జంతువులకి మాంసాహారం తేలిగ్గా జీర్ణం అవటానికి జీర్ణాశయం నిలువుగా పెట్టాడు. అదే మనిషికి...

■ అన్ని రకాల ఆనందాలని అరవై దాటాక కూడా అనుభవించేలా చేసేది శాఖాహారం.

■ ప్రపంచ ప్రఖ్యాత రచయిత బెర్నాడ్‌షా మాంసాహారం గూర్చి చెబుతూ.. 'నా కడుపు బరియల్ గ్రౌండ్ కాదు, చనిపోయిన వాటిని లోపలుంచటానికి' అని అన్నాడు.

■ ప్రపంచంలో అత్యున్నత స్థానంలో వున్నవారు, అపూర్వ విజయాలను సాధించినవారూ శాఖాహారులే. ఒక్కసారి మననం చేసుకోండి. శనీశ్వరుడికి వేడి పెరుగన్నం ప్రీతి....... అలాగే ఏ భగవంతుడ్ని అయినా తీసుకోండి...... శాఖాహారమే ప్రీతి అని శాస్త్రాలు చెబుతున్నాయి. అదే రాక్షసులకి....?





## యజ్ఞాలు ఎలా చెయ్యాలి

■ సకల మంత్రాలతో, విధులతో, శుచీశుభ్రతలతో చేసే పూజలూ, యాగాలూ సకల ఫలములనిస్తాయి. తనది కానిదీ, అధర్మమైనదీ అయిన ధనరాసులతో చేసిన యజ్ఞాల వల్ల కీర్తి, సుఖములు రెండూ కలుగవు. ధర్మమార్గంలో సాధించి గడించిన ధనముతో చేసిన యజ్ఞ యాగాదుల వల్ల మహాపుణ్యాశక్తి కలిగి ఈ లోకములోనూ, పరలోకములోనూ సుఖాలు కలుగుతాయి.

## పద్మినీ జాతికి చెందిన స్త్రీని భార్యగా పొందాలంటే...

■ సుందరమైన సర్వావయవములు కలదీ, శీల లక్షణ సంపద కలదీ, మధురమైన మాటలనే మాట్లాడునదీ, అందమైన కనులు గలదీ, పొడవాటి జుట్టు కలదీ, జోడుకి సరయినదీ, దివ్యాభరణాలు లేకుండానే ప్రకాశంతో వెలిగిపోయే అట్టి భార్యని పొందాలంటే 108 మందికి తులసి కోటలను ఇవ్వాలనీ, ఆపై శ్రీలక్ష్మీనారాయణులకు పాలతో చేసిన 108 నైవేద్యాలని నివేదించాలని శాస్త్రం శెలవిస్తోంది. శక్తి లేని వారు తొమ్మిది చొప్పున నివేదించవచ్చు.

**ఈశ్వర ఆలయానికి వెళ్ళినప్పుడు పరమేశ్వర ధ్యానంతో పాటు స్వామి మెడలోని వాసుకినీ, శ్రీమహావిష్ణువు ఆలయానికి వెళ్ళి స్వామిని ప్రార్థించేటప్పుడు ఆదిశేషుడినీ, అమ్మవారిని దర్శించినప్పుడు నాగసర్పాన్నీ ధ్యానిస్తే కాలసర్ప దోష ప్రభావాలు మీపై పడవు.**

## సోమరి పోతు తనాన్ని పెంచే వ్యాపారం

■ ఆ వ్యాపారం చేస్తే బద్ధకం పెరుగుతుంది.

■ సన్నిహితుల మధ్య, బైట పైకి మాత్రమే గౌరవం వుంటుంది.

■ చేతులు కట్టుకునేది ఒక్కసారే.. ఆ తర్వాత నుంచి లోపలా బైటా మిమ్మల్ని తిట్టుకుంటారు.

■ ఎంత సంపాదిస్తున్నా లోలోన మీకే ఆత్మనూన్యతా భావం.

■ వద్దు వద్దునకుంటూనే వ్యాపారం చేసే పరిస్థితి.

■ ఇష్టం లేక పోయినా ధర్మం, న్యాయం వదిలేసి కర్క శత్వంగా మారటం.... తద్వారా మీ ఇంట్లో కూడా ఆ ప్రవర్తన వల్ల పిల్లలు కూడా రాటుగా తేలటము.

■ సృష్టిలో ఏ ప్రాణినీ తక్కువగా చూడని ధర్మరాజు కూడా కుబేరుణ్ని ఓ సందర్భంలో నిర్లక్ష్యం చేశాడు. 'వడ్డీ వ్యాపారం చేస్తున్నానని అహంకరిస్తున్నాడు. మొత్తం వన మంతా ధ్వంసం చేయమని' భీముడితో చెబుతాడు. అంటే అవకాశం వస్తే కారణాలు లేకపోయినా మీకు అపకారం చెయ్యటానికి కూడా అవతలవారు వెనకాడరు. ఆ వడ్డీ వ్యాపారం మానేయండి. మీ దగ్గర తీసుకున్న వారు వ్యాపారం చేసేగా వడ్డీ కట్టేది. ఆ వ్యాపారమే మీరెందుకు చెయ్యకూడదు. పదిమందికి పనెందుకు కల్పించకూడదు. మీరా వ్యాపారం చేసినంత కాలం సుఖాలనీ, సౌఖ్యాలనీ ఇచ్చే శుక్రుడూ.. సంతోషాన్నీ, ఆయుష్షునూ ఇచ్చే శనీ మిమ్మల్ని వక్ర దృష్టితో చూస్తున్నట్టే. ఆ రెండు గ్రహాలు ఎంత గొప్పవంటే అవి వక్రంగా చూస్తున్నాయని కూడా తెలియనీయవు.





## మంచి భర్తని మీరు పొందాలంటే..

■ బాగా చూసుకునే వాడూ, శక్తి వంతుడూ, గుణ వంతుడూ, ఆరోగ్యవంతుడూ, అందగాడూ, ధైర్యవంతుడూ, ధనకీర్తులు గలవాడిని పొందటానికి తులసీ పూజ చేయాలి. తులసి కోట ముందు సాయంత్రం దీపాన్ని వెలిగించి మరునాటి వరకు వెలిగేలా చూసుకోవాలి. 108 రోజులు ఈ విధంగా చేస్తే మీ కోరిక నెవరవేరుతుంది. పైన చెప్పిన గుణాలతో, బంధుహితులనేకులు గలవారి ఇంట అడుగు పెడతారు.

## భర్త విషయంలో స్త్రీ ఓడిపోయినా పర్వాలేదు

■ ఆదిదంపతుల మధ్య ఎవరు బాగా నాట్యం చేస్తారని వాదన వచ్చింది. ఈశ్వరుడు, పార్వతి నాట్యం చేయసాగారు. శ్రీమహావిష్ణువు తదితరులు న్యాయ నిర్ణేతలు. ఈశ్వరుడు కాలి బొటన వేలిని కుంకుమ భరిణలో ముంచి కాలు ఎత్తి అమ్మవారి నుదుటిన బొట్టు పెట్టాడు. ఆ పని పార్వతి కూడా చేయగలదు. తనలా చెయ్యటం వల్ల భర్త పరువు పోతుందని ఆగింది.

**గర్వం వదిలితే అందరికీ ప్రియమైన వాడవుతాడు. కోపాన్ని వదిలితే శోకాల్ని పోగొట్టుకుంటాడు. లోభత్వాన్ని వదిలితే ధనాన్నీ, కోరికలు వదిలేస్తే సుఖాలను పొందుతాడు.**

**- యక్ష ప్రశ్నల్లోంచి**

## ఏ రోజు ఎలా వుంటుందో...

■ రావణాసురుడి కుక్షిలో అమృతభాండం వుందని విభీషణుడికి చెప్పిందెవరో తెలుసా.. తల్లి. కొడుకే కదా అని చెప్పింది. విభీషణుడు (సుగుణాలను పక్కన పెడితే) తేడా వస్తే అన్న అని కూడా చూడకుండా రహస్యాన్ని శ్రీరామునికి చేరవేశాడు. కాన రహస్యం అనేది ఎంతటి దగ్గరి వారికైనా చెప్పకూడదు. రహస్యాలు బైటికొస్తే ఈ కలియుగంలో పోయేది సకల సంపదలే.... ప్రాణం ఎవరికి కావాలి.

## మీ దగ్గర ధనం వుంటే.. లేకపోతే

■ ధనవంతుడయితే...

ధర్మ వడ్డీకి అరవై పైసలకి డబ్బులున్నాయి తీసుకోండి.. అంటూ వెంటబడతారు. మీ గుమ్మం దగ్గర నుల్చుంటారు. అదే మీ దగ్గర నిలవ లేదు అని తెలిస్తే మీరెంత నిజాయితీ పరులైనా.. ఆఖరికి ఇంట్లో వెండి లక్ష్మి చెంబు తాకట్టు పెట్టినా అయిదు రూపాయిల వడ్డీకి తక్కువ ఎవ్వరూ ఇవ్వరు.

## సూర్య ప్రకాశంతో పోటీ పడద్దు

సూర్యునిలా తేజస్సూ, వెలుగూ చుక్కలకీ వుంది... అయినా అవి సూర్యుడితో పోటీ పడవు. ఎందుకంటే సూర్యుడు సూర్యుడే.. అలా పోటీపడితే భంగపాటు పడక తప్పదు. డబ్బుండటం అనే విషయం చాలా చిన్న విషయం. ధనమున్న ప్రతివారు సూర్యుడంతటి వారు కాలేరు.





## ధనం కన్నా ముఖ్యమైనది...

■ లక్ష కోట్ల ధనం దూరమయితే మళ్ళీ తెచ్చుకోవచ్చు. సంపాదించుకోవచ్చు. వందమైళ్ళు ఒకేసారి వెళ్లగలిగే బ్రిడ్జికి వెల్డింగ్ చేసి అతికించే పరికరం ఉందేమో గాని విరిగిన మనసుని అతికించే పరికం లేదు. కాన ధనం కన్నా గొప్పది..

## పని అయిపోవటం ముఖ్యం కాదు

■ తక్కువ వడ్డీకి బంగారంపై అప్పులిస్తామని ఎన్ని ప్రకటనలు చేసినా వెళ్ళి ఏ కొట్లోనో ఏ మూడు రూపాయిలకో తాకట్టు పెడుతుంటారు. ఒక్కసారి స్థిమితంగా ఆలోచించి చూస్తే, చేస్తే ఎంత ధనం మిగులుతుందో చాలా మందికి తెలీదు. తెలిసినా చెయ్యరు. ఎందుకంటే ఆవేశం.. అయి పోవాలి. అంతే. కాన డబ్బు నిలువ చేయండి సంపాదించటమే కాదు ఆలోచించి అడుగు వెయ్యటం వల్ల కూడా ధనం మిగులుతుంది... ధనం ఈ ప్రపంచంలో అన్నింటికన్నా పవర్‌ఫుల్.

**గొడ్డలితో కొమ్మల్ని నరికినా చెట్టు చిగురిస్తుంది. మళ్ళీ పూలు, కాయలను కాస్తుంది. కానీ మాటలతో చెడిన కార్యము ఎన్నటికీ సఫలం అవ్వదు. శరీరంలోకి దిగిన బాణాలను తియ్యవచ్చు కానీ మనసుల్లో నాటుకున్న మాటలను తీయలేము**

**- శ్రీమహాభారతము**

## దేవుణ్ణీ, పరిస్థితుల్నీ, మనుషులనూ తిట్టుకోవద్దు

■ ఈశ్వరుడు ఎంత అదృష్టాన్నిచ్చాడో లక్షలమంది అనారోగ్యంతో బాధపడుతున్న వారిని గమనించండి. వినికిడి శక్తి లేని వారూ, అంగ వికలాంగులు ఎన్నో కోట్లమంది వున్నారు. అన్నీ సక్రమంగా, ఆరోగ్యంగా ఉండేలా భగవంతుడు చేసింది దేనికి... సాధించమని. మనలా ఉండలేని వారికి ఎంతో కొంత చెయ్యమని. నాకు ధన మివ్వలేదు.. పక్కవాడు సాయపడటం లేదు.. నా నుంచి అంత సహాయం తీసుకుని ఇప్పుడు పెడముఖం పెడుతున్నాడు... అమ్మా, బాబు ఏమీ ఇవ్వలేదు... ఇలా అను కోవద్దు. భయభీతులనూ, నిందలనూ వదిలేసి ముందుకు సాగండి. శుక్రుడూ, శని పోటీపడి మరీ సుఖాలనిస్తారు. కుజుడూ, శుక్రుడూ గృహంలో శుభకార్యాలు జరిగేలా చేస్తారు.

## శ్రీమహావిష్ణువుకి ముందు ఎవరిని పూజించాలి

■ పరమాత్మ ఇచ్చిన ఇంద్రియాలతో మనం నిత్యం అనేక రకాల దోషాలను చేస్తాం. తను సృష్టించిన మానవుడు ఇన్ని తప్పులు చేస్తుంటే శ్రీ మహావిష్ణువు ఉగ్రనరశింహంలా మండి పడుతుంటాడు. అప్పుడు శ్రీ...... అనగా శ్రీ మహావిష్ణువుని అంటి పెట్టుకున్న లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువుని శాంతింప చేస్తుంది. మన బిడ్డేగా శాంతించండి అని చెబుతుంది. శ్రీమహావిష్ణువు శాంతించడంతో లక్ష్మీదేవి తన ప్రసన్నతలను అందిస్తుంది. అయ్యవారిని దర్శించుకునే టప్పుడు ముందుగా అమ్మవారిని ప్రార్థించి స్వామి ముందరకు వెళ్ళాలి.





## వెన్ను చూపకండి...

■ విజయ లక్ష్యసాధనలో వెనక్కి తిరగకూడదు. అలా తిరిగితే సర్వనాశనమే. విక్రమ బేతాళుడి కథ తెలుసుగా. బేతాళుడు ఏం చెబుతాడు.. 'రాజా! వెనక్కి తిరగకుండా ముందుకు నడువ్' అని. ఆ గాథలో అర్థం అంత వుంది. ఏ విషయంలోనైనా ముఖ్యంగా వివాదాల విషయంలో వెనక్కి తిరిగితే మీకే అంతా నష్టం. యుద్ధంలో వెనక్కి తిరిగితే శత్రువు కాదు.. తోటి సైనికుడే చంపేస్తాడు.

## స్త్రీని చూసి నేర్చుకోవాలి...

■ వాడు మోసం చేశాడు... వీడు మోసం చేశాడు... అని బాధపడటం వల్ల ప్రయోజనం శూన్యం. భగవంతుడు తెలివితేటలని స్త్రీ, పురుషులకి సమానంగా ఇచ్చాడు. పదో తరగతి చదివే ఆడపిల్ల కూడా మగాడు మాట్లాడుతూ ఎక్కడ చూస్తున్నాడో.. ఏ ఉద్దేశ్యంతో చూస్తున్నాడో కంప్యూటర్ కన్నా వేగంగా సెకన్‌లో వెయ్యోవంతు కాలంలో పసి కడుతుంది. అలా అని వాడ్ని తిట్టదు. వాడ్ని ఎక్కడుంచాలో అక్కడుంచు తుంది. గణిత శాస్త్రంలో నిష్ణాతురాలైన శకుంతలాదేవి కన్నా వేగంగా తన అమూల్యమైన ఆస్థి కోసం గోతి కాడ నక్కలెవరో.. ఆవులెవరో ఆడది పసిగడుతుంది. కాన మాటలని కాదు మాటల వెనకున్న, కళ్ళ క్రిందున్న ఉద్దేశాలని గమనిస్తే మోసపోవటమన్నది వుండదు.

## సుఖాల కోసం, అధికారం కోసం

## విదురుడు చెప్పిన నీతులు

■ ప్రభువు, భగవంతుడు, భార్య, బంధువులతో తగిన విధంగా మసులుకుంటే తగు సుఖ ఫలితాలుంటాయి.

■ వివేకం లేని వారు తమంటే ప్రీతి లేని వారి వెంటపడుతూ ప్రేమించేవారిని దూరంగా ఉంచుతారు. ఆపేక్ష లేనివారితో కలిసి మెలిసి ఉంటూ ఏవేవో జరగని కలలు కంటారు.

■ సంపదా, జ్ఞానం, వంశ చరిత్రలు దుర్బుద్ధులకి అహంకార మదాలను తెస్తాయి. అదే సద్బుద్ధులకు వినయాన్నీ, విధేయతనూ, అణుకువనూ, గౌరవాన్నీ, కీర్తినీ తెస్తాయి.

■ చక్కటి తీపి పదార్థాలను ఒక్కడే తినటము, అందరూ నిద్రపోతుంటే మేలుకొని వుండటమూ, ఏ కార్యాన్నయినా ఒక్కడే చెయ్యాలనుకోవటమూ, ఒకే దారిలో నడవటమూ చెయ్య దగ్గవి కావు.

■ పౌరుష పదాలు మాట్లాడక పోవటమూ, పాపపు కార్యాలను తల పెట్టకపోవటమూ వంటి వాటి వల్ల లోకం చేత ఉత్తముడని కీర్తింపబడతారు.

■ అర్హతకు తగ్గట్టు దుస్తులను ధరించాలి. తన గూర్చి తాను పొగుడుకోకూడదు. తొందరపడి దానాలిచ్చి ఎందు కిచ్చామా అని అనుకోకూడదు. శత్రువు అర్థించినప్పుడు ఆదరించాలి.

■ ధర్మంగా సంపాదించిన ధనాన్ని అర్హులకే ఇవ్వాలి. పొగిడాడనో, మరొకటి చేశాడనో అనర్హులకి ఇవ్వకూడదు.

■ పరుల ధనాన్నీ, జ్ఞానాన్నీ చూసి ఈర్ష్య చెందితే రోగం రాకుండానే వచ్చినంత వ్యధ శరీరం లోనవుతుంది.





## యవ్వనం రాజ్యాధికారం కన్నా గొప్పది

■ యయాతి, నహుషుడి గాథ చదివిన వారికి తెలిసే వుంటుంది. పుత్రులు వారి యవ్వనాన్ని తనకి ఇస్తే సకల భూమండలానికి చక్రవర్తిని చేస్తానని చెబుతాడు యయాతి. ఓ పుత్రుడు యవ్వనం అనగా ఆరోగ్యం లేకపోతే అంగ నాంగలు, ఎంత ధనమున్నా, ఇచ్చినా ఎందుకుచూస్తారు. ఏం చెయ్యగలము. నాకు యవ్వనమే కావాలంటాడు. మరొక పుత్రుడు పంచభక్ష్య పరమాన్నాలు ఉన్నా తినలేను..... సాధించాల్సింది సాధించలేను, చూడవల్సింది చూడలేను. నాకూ రాజ్యాధికారం వద్దు యవ్వనమే కావాలంటాడు. యవ్వనం అనగా ఆరోగ్యం. ఆరోగ్యం ఎంత గొప్పది. ద్వాపర యుగంలో యవ్వనాన్ని ధారాదత్తం చెయ్యచ్చు. ఈ కలియుగంలో కలికీ, ధన శక్తికేమో ఈశ్వరుడు ఎవరి యవ్వనాన్ని వారికే వుండేలా భద్రం చేశాడు. కాన దాన్ని చెడు అలవాట్లతో వృధా చెయ్యక జీవితంలో ఏదో ఒకటి సాధించండి. సుఖించండి.

## పురుష సూక్తం, స్త్రీ సూక్తం చదవగానే

■ వెంటనే గోవింద నామాలు చదవాలి. జయ గోవింద అన్నప్పుడు రెండు చేతులనూ పైకెత్తి స్వామిని తలచుకొని నమస్కరించాలి..... గోవింద నామస్మరణ శనీశ్వరునికి ప్రీతికరం.

**సుఖాల కోసం చింతించకూడదు. దుఃఖం వల్ల శక్తి నశిస్తుంది. మనసు పాడవుతుంది. శత్రువులకి సంతోషం కలుగుతుంది. దానితో పాటు శరీరంలోకి రోగాలు ప్రవేశిస్తాయి.**

## కష్టాలు పడటము, లేనితనము దరిద్రం కాదు

■ పాపం కూడా కాదు. పాండవులు అరణ్యవాసంలో కాయా, పండు తిన్నారు. కటిక నేలమీద నిద్రించారు. ధర్మం తప్పలేదు. మళ్ళీ అన్నింటినీ అందుకున్నారు. దరిద్రం అంటే పట్టు పరుపులు ఉండి నిద్ర రాకపోవటము, మహదరిద్రమంటే తినటానికి అన్ని వనరులుండి తినలేకపోవటము. అన్నీ వున్నా అనుభవించలేకపోవటము.

## శని, జ్యేష్ఠాదేవిల వివాహం చదివితే...

■ మహాభీకరంగా, భయం గొల్పేలా వుండే శనీశ్వరుడు తాను వివాహం చేసుకోబోయే వధువు తన కళ్ళల్లోకి సూటిగా చూసే ధైర్యం కలిగింది కావాలని షరతు పెడతాడు. కారు నలుపుతో... నిప్పుల్లా వుండే కళ్ళతో, వికారంతో ఒక్క క్షణం కూడా చూడలేనంతగా వుండే జ్యేష్ఠకి నారదుడు చెబుతాడు.. నీ కళ్ళల్లోకి చూస్తే దిష్ఠి తగులుతుంది.. చూడలేను... అని పక్కకి తిరిగి చెబుతాడు.... శని నీకు తగిన వరుడు... సూర్యమండలం వద్దకు వెళ్ళమని చెబుతాడు. ఆపై శనీశ్వరుడు జ్యేష్ఠ కళ్ళల్లోకి చూస్తాడు. జ్యేష్ఠా శని కళ్ళల్లోకి నిబ్బరంగా చూస్తుంది. ఆపై వారి వివాహం అయింది. ఈ గాథ విన్నా, చదివినా దిష్ఠి పోతుంది.

## ఇలా చేసినా అనుభవించాల్సిందే

■ చెడుని వినటం ద్వారా చెవుల నుంచీ, చూడటం ద్వారా కనుల నుంచీ, ఆలోచించటం ద్వారా శరీరమంతా వ్యాపించి కలుషితం చేస్తుంది. ఎంత ధనమున్నా కనీస సుఖాలు లేకుండా చేస్తుంది.





## మిత్రుడా, శత్రువా?

■ శత్రువు తమని దెబ్బకొట్టబోతున్నాడనీ, కొడతాడనీ తెలిసి మెళకువతో వుంటాము. అదే మిత్రుడు కొడితే దిమ్మ తిరిగిపోతుంది. తేరుకోవటానికి సంవత్సరాలు పడుతుంది. మిత్రుడికన్నా శత్రువే బెటర్...... శత్రువుకి ఎప్పుడూ భయపడాల్సిన పనిలేదు. మిత్రత్వం పేరుతో చుట్టూ వున్నవాళ్ళ విషయంలో ఎలర్ట్‌గా వుండాలి. ఎందుకంటే మీకు తెలియని భయంకరమైన ఈర్ష్యా అసూయలని వారు భద్రంగా తమలో దాచుకుంటారు. అవకాశం దొరకగానే వికటాట్ట హాసం చేసి భయపెడతారు. ఒకప్పుడు స్నేహంగా ఉండి ఇప్పుడు శత్రువులయ్యే వాళ్ళు ఎక్కువమంది అలాంటివాళ్ళే...... స్నేహితులూ, గూఢచారులూ ఒకేలా ప్రవర్తిస్తారు. తేడా తెలుసుకోకపోతే మునిగిపోయినట్టే.

## నవగ్రహ ప్రార్థన సమయంలో ఏ గ్రహానికి ఏ దుస్తులు ధరించాలి

■ సూర్యుని పూజా సమయంలో ఎరుపు.. చంద్ర పూజలో తెలుపు, గురుని పూజిస్తే పసుపు, శుక్ర పూజలో తెలుపు, బుధ పూజలో పచ్చ, కుజ(అంగారకుడు) పూజలో నారింజ రంగు, కేతు పూజలోకి ఎక్కువ రంగులు కలవాటిని ధరించాలి. ఇంకా రాహువుకి నలుపు ఇక శనీశ్వరుడిని నీలి రంగు దుస్తులను ధరించి పూజించాలి.

**పక్షులకి ఆహారం నలభై ఒక్క రోజులు వేస్తే రుణభారం తీరుతుంది. సమస్యలు మాయమవుతాయి.**

## ఏ కోరికైనా లక్ష్మీదేవిని ఎప్పుడు అడగాలి

■ శ్రీలక్ష్మీనారాయణులని కలిపి పూజించేటప్పుడు ఏ కోరికా కోరకూడదు. పక్కన శ్రీమహావిష్ణువు కూడా విని మండిపడతాడు. ఓ పక్క తప్పులూ...... దోషాలూ చేస్తూ మళ్ళీ కోరికలా అని కోపిస్తాడు. అందుకే పూజ అయ్యాక.... మీరు చిన్నప్పుడు నాన్నని ఏదన్నా అడిగినప్పుడు ఆయన కోపిస్తే.. ఆపై నాన్న లేకుండా అమ్మ దగ్గరి కెళ్ళి కోరిక చెప్పి చేయించుకున్నారో అలా లక్ష్మీదేవిని లక్ష్మీనారాయణుల పూజ అయ్యాక అడగాలి. ఆపై ఆమె ఆయనకి సర్ది చెప్పి మీ కోరికను తీరుస్తుంది.

## ఆర్థిక వ్యవస్థ దెబ్బతినటానికి శత్రువులే కారణం

■ అలాంటప్పుడు మీరు ఆవేశానికి లోనయితే ఇంకా ఇంకా నష్టపోతారు. ఓర్పుతో ఉండాలి. అవకాశం కోసం ఎదురు చూడటం ఒక పద్ధతి........ అసలు అవకాశాన్నే సృష్టించుకోవటము రెండో పద్ధతి. అవతల వాళ్ళకి కోపం తెప్పించారంటే చాలు ఆ ఆవేశంతో తప్పు చేస్తారు. ఆ తప్పునే పగ్గాలుగా పట్టుకొని అన్ని వైపులా బిగించండి. వాడి పాపానికి వాడే పోతాడులే అని అనుకుంటే, అక్రమాలు సహిస్తుంటే మీరు అన్యాయమై పోతారు..... మిమ్మల్ని నమ్ముకున్న వాళ్ళు అన్యాయమైపోతారు. న్యాయాన్ని అవతలవారు తప్పినా మీరు తప్పవద్దు. కోపాన్ని తెప్పించి విజయం సాధించండి.





## శ్రీమహావిష్ణువూ, లక్ష్మీదేవిలను కలిపి ఎందుకు పూజించాలి

■ నాకు శ్రీరాముడు అక్కర్లేదు సీత చాలు అని సీతమ్మని అపహరించుకుపోయిన దశకంఠుడు ఏమయ్యాడు.

■ సీత వద్దు నాకు శ్రీరామచంద్రుడే కావాలన్న శూర్పణఖ ఏమయ్యింది.

■ ఇద్దర్నీ కలిపి పూజించినందుకే వాయుపుత్రుడు హనుమంతునికి అంత శక్తి.

■ సీతారాములని కలిపి సేవించటం వల్లే విభీషణుడు అన్న బ్రతికుండగానే లంకానగర ప్రభువయ్యాడు.

■ ఇద్దర్నీ కలిపి సేవించటం వల్లే సుగ్రీవుడు తన భార్యనీ, రాజ్యాన్నీ తిరిగి పొందాడు.

■ శివ... విష్ణు... అలా ఏ దేవతలనైనా భార్యాసమేతంగా పూజించండి. అప్పుడే అనంతమైన శక్తీ.. సుఖాలు.

## తీర్థయాత్రలకి వెళ్ళేటప్పుడు గొడవలొద్దు...

■ యాత్రలకీ, శుభకార్యాలకీ వెళ్ళే ముందు పోట్లాట వంటివి పెట్టుకోవద్దు. తద్వారా వెళ్ళిన కార్యం మీద మనసు లగ్నం అవ్వక రసాభస అవుతుంది. పర్వతుడికి కూడా ఇలాంటి సమస్యే వచ్చింది. సతీదేవి ఖండాన్ని రక్షించవల్సిన పరిస్థితిలో తీర్థయాత్రలని కూడా పక్కన పెట్టి యుద్ధం చేశాడు. తప్పని స్థితి అయితే తప్పదు. తప్పు లేదు.

## ఎక్కువగా మాట్లాడకండి

■ క్రింద స్థాయి వారితో పనిచేసేటప్పుడు వారితో ఎక్కువ మాట్లాడకపోవటం వల్ల వాళ్ళ ఉద్దేశ్యం ఏమిటో మీకు బాగా తెలుస్తుంది. తద్వారా మీరు సమర్థవంతంగా వ్యాపారాన్ని నడపగలుగుతారు.

■ అమావాస్య, పౌర్ణమిలలో ఆల్చిప్ప బాగా తెరుచుకుంటుంది నీటి చుక్కని ముత్యంగా చెయ్యటానికి. కానీ అదే అదనుగా దాన్ని ఆహారంగా చేసుకోవటానికి చిన్న రాయిని అందులో వేసి దాన్ని తినేస్తుంది పీత. నోరుతెరవటం అనగా మాట్లాడటం సమయం, సందర్భం చూసి చెయ్యాలి.

■ ఇంట్లో ఎలా అయినా వుండండి. బైట మాత్రం ఎంతో అందంగా తయారై వెళ్ళండి. మీ పని గూర్చి మాటలు మాట్లాడాల్సివస్తే ఎంత వీలయితే అంత తక్కువ మాటలను వాడండి. అనవసర మాటలతో వాళ్ళకి ఛాన్స్ ఇవ్వకుండా మాట్లాడేయకండి. అలాంటప్పుడే అవతల వారి నుంచి అసలు నిజాలు బైటికి వస్తాయి.

■ అవతల వాళ్ళు చిన్న నిజం చెప్పగానే ఆవేశపడకండి. వేటగాడు ఎరవేసినప్పుడు ఎరగా దగ్గరగా వచ్చిన జంతువును చూసి తొందరపడడు. దాని వెనుకొచ్చే పెద్దవాటి కోసం వేచి వుంటాడు. అలాగే సహనంగా వుండండి. ఒకటి తర్వాత రెండు.. అలా ... మొత్తం చెప్పేస్తాడు.

## జన్మ శని పోవాలంటే

■ తిరుమలలో జపాలి ఆంజనేయస్వామి స్వయం భువుగా వెలిసిన రామకొలనులో పౌర్ణమినాడు స్నానం చేస్తే జన్మ శని పోతుందని పురాణ సారాంశము. శ్రీరాముడు రావణ సంహారం తర్వాత అయోధ్య వెళుతూ ఇక్కడ బస చేయటం వల్ల అక్కడ కొలను రామకొలనుగా ప్రఖాతి గాంచినది.





## ఆడవాళ్ళంటే దేవుడికి ఎంతో ప్రేమ...

■ 'దేవుడు కూడా మగాడేగా...' అని ప్రతి స్త్రీ ఏదో సందర్భంలో నిష్టూరాలాడుతుంది. కానీ అది చాలా తప్పు. సృష్టి ప్రారంభంలో స్త్రీని, పురుషుడిని పుట్టించి భూమి మీదకు పంపాడు..... సమ బల తెలివి తేటలిచ్చాడు. ఇద్దరూ కొట్టుకుచచ్చారు. ఇలా కాదని స్త్రీకి ఎక్కువిచ్చి, మగాడికి తక్కువిచ్చాడు. దాంతో స్త్రీ మగాడ్ని మూల కూర్చోబెట్టి పెత్తనం సాగించసాగింది. వెధవని చేసి ఆడుకుంది. అది కరెక్ట్ కాదనుకొని పురుషుడికి బలమిచ్చి స్త్రీకి బలం కొంత తక్కువిచ్చాడు. దాంతో పురుషుడు ఏకంగా స్త్రీని చంపేశాడు. బ్రహ్మదేవుడు తల పట్టుకున్నాడు.

■ పురుషుడికి బలం ఇస్తే స్త్రీని బ్రతకనీయటం లేదు.. స్త్రీ ఏమో పురుషుడ్ని వెధవని చేస్తుంది... అప్పుడొచ్చింది ఆలోచన... అందం, కామం కలిపాడు. వాటి ద్వారా అద్భుత సుఖం సృష్టిలో పొందచ్చునీ........ ఇచ్చేది స్త్రీ మాత్రమేనని పురుషుడికి తెలిసేలా చేశాడు. దాంతో కొమ్ములు తిరిగిన మగాడయినా, దేశానికి రాజయినా ఆడదాని ముందు తలవంచేలా చేశాడు. అర్రులు చాచాలే చేశాడు. పురుషుడ్ని ఎక్కడ దాకా రానీయాలో స్త్రీకి చెప్పాడు. ఆ రకంగా భూమి మీద స్త్రీ జాతినంతా దేవుడు కాపాడాడు.

**శత్రు శేషం.. రుణ శేషం... వ్రణ శేషం ..**
**ఈ మూడు రుణాలు ఎట్టి పరిస్థితుల్లో కూడా**
**ఉండకూడదని శాస్త్రం గట్టిగా చెబుతోంది.**

## కత్తికి రెండు వైపులా పదునుండాలి

■ బాధలూ, సమస్యలూ.. కష్టాలూ అన్నీ వచ్చేవి మన చుట్టూ వున్న వారి వల్లే. అలాంటప్పుడు వాటి నుంచి బైటపడాలంటే ఏం జరుగుతుందో ఎవ్వరెలా ప్రవర్తిస్తున్నారో తెలీదు. అలాంటి విషమస్థితిలో కాపాడేది రెండోవైపు పదును. అంటే మనకున్న పరిచయాలు, స్నేహాలు. అన్నీ రెండు వైపులా వుండాలి. అటు ఇటు, ఇటు అటు ఎట్టి పరిస్థితుల్లోనూ కలవకూడదు. ఏ వైపు తేడా వచ్చినా రెండో వైపు నుంచి సమస్యకి పరిష్కారం దొరుకుతుంది.

## బైట ఆహారం మీ దశనే మార్చేయవచ్చు

■ రాత్రి మిగిలిన సాంబారులో నీళ్ళు కలిపి వేడి చేసి మీకు పోయచ్చు. సాంబారుతో తినాలంటే రాత్రి పూట తినటం ఆరోగ్య శ్రేయస్కరం. ఇక చట్నీ అయితే రాత్రి మిగిలింది పెనం మీద వేడి చేసి ఉదయం చట్నీలో కలుపుతారు. (అన్ని చోట్ల అందరూ ఇలాగే చేస్తారని నా ఉద్దేశ్యం కాదు) అలా చేసింది అయిపోగానే ఫ్రెష్‌గా మళ్ళీ చేస్తారు కాబట్టి తొమ్మిది గంటల తర్వాత బైట తినటం మంచిది. ఇక పెసరట్టు, గారె, మైసూర్ బజ్జీ (నిలవుంటే పులిసి పోతాయి కాబట్టి) వంటివి తీసుకోవటం మంచిది. ఇంకా అల్పాహారం తీసుకోవాలంటే టిఫిన్ మాత్రమే అమ్మే చోట తినాలి. అలాగే భోజనం చెయ్యాలంటే భోజనం మాత్రమే అమ్మే చోట తినటం ఎంతో మంచిది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే నానా చెత్త తినటం వల్ల అనారోగ్యం.. తద్వారా.. ధనం, లక్ష్యసిద్ధి దెబ్బతింటాయి.





## అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ బైలుదేరతారు

■ లక్ష్మీదేవి, జ్యేష్ఠాదేవి ఇద్దరూ ఉదయాన్నే బైలుదేరతారు. ఇంటి ముందు శుభ్రంగా అలికి ముగ్గులుపెట్టి వుంటే లక్ష్మీదేవి లోపలకి వస్తుంది. జ్యేష్ఠాదేవి అపరిశుభ్రంగా వున్న ఇల్లుని చూసుకొని సంతోషంగా లోనికెళ్తుంది. అలాగే సాయంత్రం సమయంలో దీపం వెలిగించని ఇంటికి జ్యేష్ఠా దేవీ....... వెలిగించిన ఇంటికి లక్ష్మీ దేవి వచ్చి వారి వారి అనుగ్రహాలని ఇచ్చి వెళుతుంటారు.

## వడ్డీ వ్యాపారం ఎవరు చేయాలి

■ వడ్డీ వ్యాపారం (అనుమతి లేకుండా) చేసే వారికి కొన్ని పదవులు అధిష్ఠించటానికి అవకాశం లేదు. దాన్ని బట్టి ఆలోచించండి. ఆ వ్యాపారం మంచిది కాదని. చుట్టూ వున్న వాళ్ళెవరూ మీకు నిజమైన స్నేహితులు కారు. కేవలం మీ దగ్గర అప్పు తీసుకున్న వారు మాత్రమే మిగులుతారు. ధర్మబద్ధంగా ధర్మ వడ్డీ తీసుకోవాల్సిందీ, చెయ్యాల్సిందీ అరవై దాటిన వారు మాత్రమే అని శాస్త్రం చెబుతోంది. అలా అని ఆ వయసులో ఇస్తే తిరిగి ఇవ్వటానికి ఇది సత్య యుగం కాదు..... భద్రతనిచ్చే బ్యాంకులని ఎంచుకోండి. వయసు వున్నప్పుడు, ఓపిక వున్నప్పుడు పనిచేయండి. పదిమందికీ పని కల్పించండి.

**ఈ సృష్టి ఆదిలో ప్రారంభమైన వారం ఆదివారం. అందుకే ఆదివారమని పేరు. అందుకే ఆదివారం నాడు వచ్చే ఉగాది మహామహితాన్వితమైన ఫలాన్ని ఇస్తుంది**

## గుప్పిట బిగించటమంటే

■అవతల వారి ధనం కావచ్చు.. వారి సంబంధిత సరుకు కావచ్చు. లేనిపోని కోపాలతో వాటిని ఆపాలని చూస్తే లక్ష్మీదేవికి ఆగ్రహం వస్తుంది. మీరే మీ మీ బలాలతో బిగిస్తే.. అంటే అడ్డుకుంటే మీ ఇంట జరగాల్సిన పనులను ఆమె అడ్డుకుంటుంది. గృహంలో శుభకార్యాలు ఇత్యాదివన్నీ ఎందుకు అవ్వటం లేదని అందరి చుట్టూ తిరగాల్సి వస్తుంది. అలా చేసిన పాపమే వారికి ఆ స్థితికొని తెస్తుంది. ఎన్ని పూజలు చేసినా ఆ పాపం పూర్తి అయ్యే వరకూ ఆ వ్యధ మీకు తప్పదు. కాన అలాంటివి వలదు.

## శత్రువుకి దూరంగా పోతే....

■ పాపం.. పుణ్యం.. ధర్మం.. న్యాయం.. శాస్త్రం ... జాలి, దయా, అలా ఏదో ఒకటి చెప్పుకుని దూరంగా వెళితే ధనం కూడా దూరమవుతుంది. ఎందుకంటే శత్రువుని మీరు వదిలినా వాడు వదలడు. యుద్ధం ప్రారంభించకూడదు, ప్రారంభిస్తే ఆపటం, ఆగటం ఎవ్వరి చేతుల్లో వుండదు. చుట్టూ అందరి చేతుల్లోకి వెళ్తుంది. దూరంగా వెళ్ళటం అంటే యుద్ధ రంగంలో వెనక్కి మరలినట్టే. యుద్ధంలో వెనక్కి మళ్ళితే.. శత్రువు కాదు మనవాడే శత్రువు కార్యాన్ని పూర్తి చేస్తాడు. శత్రువుని గెలిస్తేనే సంపద.... గెలవాలంటే ధర్మబద్ధంగా సాగాలి. అవసరమైన చోట తగ్గాలి. ఆవేశపడే చోట కూడా ఆలోచించి మాట్లాడాలి. అందుకే మన పెద్దలనేది శత్రుశేషం, ఋణశేషం, వ్రణశేషం మిగల్చకూడదని. ఇంద్రుడంతటి వాడు శత్రువుని గెలవటానికి మిత్రత్వాన్ని ఎన్నుకున్నాడు. వృత్రాసురుడి నుంచి లోకాలని రక్షించాడు.





## జీవితాన్ని అల్లకల్లోలం చేసేది రాహువు

■ కొత్త పరిచయాలు.. తద్వారా తప్పుడు నిర్ణయాలు. కొత్త కొత్త అలవాట్లతో మనిషిని అతలాకుతలం చేసేది రాహువే. రాహువు దుర్మార్గపు స్వభావం కలవాడు. ఏదైనా చేయిస్తాడు. చెడు స్త్రీలను దగ్గరకి వచ్చేలా చేస్తాడు. పారిపోయే పరిస్థితిని కల్పిస్తాడు. అలాంటి రాహు గ్రహ దోషాలు పోవటం కోసం...... శాంతి కోసం...... నదిలో పద్దెనిమిది రోజులు కొబ్బరికాయలను విడిచి దుర్గాదేవినీ, రాహువునీ పూజిస్తే దోషాలు పోతాయి........ అలాగే గృహంలో నెమలిపింఛం కనబడేలా ఉంచండి.... కొత్తవాళ్ళతో అతి చనువును పెంచుకోవద్దు... ఆ దిశగా రాహువు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటాడు.

## చంద్రుడు చల్లగా చూస్తేనే

■ చంద్రుడు గురుభార్య తారను తన అందంతో ఆకర్షించాడు. దాంతో మహా శాపానికి గురయ్యాడు. స్త్రీ కోరితే కాదంటే ఖచ్చితంగా ధర్మం కాదు. కానీ గురుపత్ని. వరుస చూడాలి... అలా కాకుండా స్త్రీ కోరిందని వెళితే.. దోషం తప్పదు. తనలా క్షీణించిపోక తప్పదు. అందుకనే స్త్రీ విషయంలో వరుస తప్పితే చంద్రుని వక్ర దృష్టి సోకుతుంది. తద్వారా సంసారంలో బాధలు తప్పవు. కాన అవి చేయకండి తాను చేసిన తప్పు మరొకరు చేయకూడదని చంద్రుని అభీష్టం.

**చేపలకి గోధుమపిండి వుండలను నలభై ఒక్క రోజుల పాటు వేస్తే పోయిన కీర్తి ప్రతిష్ఠలు తిరిగి చేరతాయి.**

## శక్తికి మించి ఇవ్వద్దు

■ మీ శక్తి గురించి కాదు. అవతల వారి శక్తికి మించి ధనం ఇస్తే నరకయాతన పడేది మీరే. అంత ధనం ఇవ్వలేక వాళ్ళు పెట్టే టార్చర్‌కి మీ కళ్ళ నుంచి రక్తం వచ్చే స్థితి వస్తుంది. మీరు మానసికంగా కూడా బాధపడాల్సి వస్తుంది. స్నేహమనో, రక్తసంబంధమనో ఇస్తే బాధపడేది మీరూ, మీ వాళ్లు మాత్రమే.

## ఉప్పులో చెయ్యిపెట్టి డబ్బులిస్తారు

■ అలా ధనాన్ని ఇస్తే తీసుకున్న వాళ్ళు తీర్చలేరనీ, జీవితాంతం వడ్డీ రూపేణా చెల్లిస్తారని కొందరు అలా చేస్తారు. తీరని బాకీల విషయంలో ఉప్పులో పెట్టి డబ్బు లిచ్చామంటారు. అందుకే తీరటం లేదంటారు. దాన్ని పక్కన పెడితే అలా ధనం ఇస్తే వడ్డీ సంగతేమో గాని మీరేం చేసినా పుణ్యం రాదు. సుఖాలు రావు. వేశ్య ఆకర్షణలో పడ్డ ఋష్యశృంగుడు హోమాగ్ని వెలిగించినా వెలగలేదు. అలా ఏ పుణ్య కార్యం చేసినా పుణ్యం ఒక్క శాతం కూడా రాదు. తీసుకున్న వాళ్ళు బాగుండాలని ఇవ్వాలి. తీర్చాలని ఇవ్వాలి.

## ఆలయాలంటే ఆరోగ్య నిలయాలు కూడా

■ ప్రతిరోజూ యాపిల్... అనే ఆంగ్ల సూక్తిని పక్కన పెట్టండి. ప్రతిరోజూ రెండు పూటలా ఆలయ దర్శనం, నెలకోసారి దూరంగా వున్న పవిత్ర ప్రదేశాలకి వెళ్ళటం, అక్కడ గడపటం వంటివి చేయండి...... ఎనభై, తొంభై సంవత్సరాల వయస్సుతో ఉన్న అక్కడివారిలోని పటుత్వాన్ని గమనించండి. ఆరోగ్యలక్ష్మి కోసం ఎక్కువగా పుణ్యక్షేత్రాలను దర్శించండి.





## ఆకలేస్తే తన పిల్లల్ని తానే తినేది

■ విషపు జంతువే కాదు. కొంతమంది మనుష్యులు కూడా. వాళ్ళకి కష్టపడటం రాదు. తెలివితేటల్ని చుట్టూ వున్న వారి మీద చూపిస్తారు. బలహీనతలని ఆసరాగా చేసుకొని సంపాదిస్తారు. వాళ్ళు బ్రతికేదే తమ చుట్టూ వున్న వారి మీద. అలాంటివాళ్ళని పక్కనుంచుకుంటే వారితో కలిస్తే, సహవాసం చేస్తే పామును పక్కన పడుకోబెట్టుకోవటమే.

## ఇలా అంటే శుభకార్యాలు ఆలస్యమవుతాయి

■ పెళ్ళికి పిలవలేదు. అందుకే రాలేదు. మొక్కుబడిగా పిలిచాడు. ఇలా మాట్లాడకూడదని శాస్త్రం చెబుతోంది. గృహంలో శుభకార్యం ఆలస్యం అవుతుంటే... ఒక్కసారి అవతల వారి శుభకార్యాల్లో చెయ్యి కడిగితే చాలు పిలవక పోయినా బాగా దగ్గరి వారయితే వెళ్ళి కేవలం ఆశీర్వదించి రమ్మని ధర్మం చెబుతోంది.

**అతి మంచి, జాలితనం కూడా ప్రమాదకరం. ధనం సంగతి అటుంచండి. ప్రతిరోజు అనగా ఇరవైతొమ్మిది రోజులు ఒకటికి మూడు పూటలా అన్నం పెట్టండి. ఒక్క రోజు పెట్టకండి. వాడు ఇరవై తొమ్మిది రోజులు మూడు పూట్ల మీరు అన్నం పెట్టిన సంగతి వదిలేసి ఆ ఒక్క రోజు పెట్టలేదని అవాకులూ చవాకులని ఇరవై తొమ్మిది ఇంటూ ఇష్టం వచ్చిన, శక్తిని బట్టి అంకెవేసి హెచ్చించి మరీ చెబుతాడు.**

## రోజువారీలూ, చీట్లూ కడుతుంటారా....

■ అలా కట్టడం ఎప్పటికీ భద్రం కాదు. అధిక వడ్డీల వల్ల మీ ధనమూ, అత్మస్థైర్యం కూడా దెబ్బతింటుంది.... శత్రువులకి తలుపు లేని ఇల్లులా అనిపిస్తుంది మిమ్మల్ని చూస్తే. ఆ విషయం వదిలేస్తే కొంతమంది వడ్డీ వ్యాపారస్థులు మీరు పదికడితే తొమ్మిదే అంటారు.

■ ఒకటో, రెండో ఎక్కువ కట్టించటానికి ప్రయత్నిస్తుంటారు. అందుకు అవకాశం ఇవ్వకండి. ఎదైనా రాయించండి. అలాగే కొంత మంది ప్రతి వారి దగ్గర చేబదులు పదీ, పరకా అడిగి తీసుకుంటారు....... చిన్నదే కదా, ఏం రాసు కుంటాంలే అనుకుంటారు. ఆ బద్ధకం పెద్ద విషయాల్లో జరిగి మీకు తెలియకుండానే ధన నష్టం జరుగుతుంది. శ్రీవేంకటేశ్వరునికి అప్పు ఇచ్చిన కుబేరుడు ప్రతిరోజూ ధనం రాకడ, పోకడ లెక్క చూసుకున్న తర్వాతే నిద్రకు ఉపక్రమిస్తాడు. ఒక్క రూక తేడా వచ్చినా అది తేలేంత వరకూ నిద్రపోడు. పురాణాలూ, ఇతిహాసాల్లో నుంచి తెలుసుకోవాల్సిందీ, మన జీవన యానానికి ఉపయోగించు కోవాల్సిన విషయాలు చాలా ఉన్నాయి. భక్తి వేదాంత ధర్మ తత్వమొక్కటే కాదు.

## కనుమరుగైపోయిన సంప్రదాయం

■ పూర్వం శిశువు జన్మించగానే చీకటిలో వుంచేవారు. అందులోనే బొడ్డు కోసేవాళ్ళు. అలా చెయ్యటం వల్ల పూర్వజన్మ తాలూకూ కర్మఫలాలు సమసిపోతాయనీ, కష్టాలు వుండవనీ పెద్దలు అలా చేసేవాళ్ళు.





## తైలాభిషేకం చేస్తే

■ కాకి వాహన ధారుడు శనీశ్వరుడు అంటే భయపడని వారు లేరు. కానీ ఆ శనీశ్వరుడే గృహాన్ని కట్టుకునే ఆర్థిక శక్తిని ఇచ్చేది.... వివాహం అవుతున్నవారు కేవలం శనికి తైలాభిషేకం చేయించినంతనే సంతృప్తి చెంది కోరికలను తీరుస్తాడు. శని ప్రాణ కారకుడు. తీర్థ యాత్రలకు వెళ్ళే వారు నవగ్రహాలకి తైలాభిషేకం చేయించి బైలుదేరితే సుఖ ప్రయాణం జరుగుతుంది.

## రూపాయి ఎందుకు పుట్టడం లేదు

■ అడగగానే లక్షలు ఇచ్చే వాళ్ళు.. ఎన్నిసార్లు అడిగినా ఎందుకు మొహం చాటేస్తున్నారు. ఒక్కరు కాదు అందరూ. కేవలం రూపాయి దగ్గర కూడా వినయంగా మాట్లాడుతూ ఎందుకు తప్పుకుంటున్నారు. ఆలోచించండి.. వాళ్ళతో మీరు ఎలా మాట్లాడారో.. మీరేం చేశారో. బాగా ఆలోచించండి.. అవసరం కోసం ఎవ్వరినయినా అడగచ్చు. కానీ అలా అడిగే వాళ్ళకి మీరు ఖచ్చితంగా న్యాయం.. సహాయం చేసి వుండాలి. అలా లేకపోతే ఖాళీ చేయే. ఇవ్వనని కూడా చెప్పరు. రోజులు.. నెలలు గడుస్తుంటాయి. కానీ ఇవ్వరు. అదే దుర్దశ. దాన్ని మార్చుకోండి.

**పగా, ప్రతీకరము, కక్షా కార్పణ్యాలు, ద్వేషం వదిలేసి అవతల వాళ్ళని చూడండి. మీరెంత గొప్పవారవుతారో పక్కన పెట్టండి. ధనం ఎంత పెరుగుతుందో గమనించండి.**

## కొంతమందికి నవగ్రహాలిచ్చే ఎక్స్‌ట్రా శాపాలు

■ అద్భుతమైన అందంతో తెల్లగా పుట్టించడం.

■ ఒక్కసారిగా వృత్తిలో అమితమైన పేరు రావటం.

■ ఊహించని విధంగా కుప్పలు కుప్పలుగా ధనం రావటం.

■ సంవత్సరాలుగా తపిస్తున్న వారికి రాని అవకాశం రావటం.

■ అత్యంత ధనం.. పలుకుబడి.. అధికారం వున్న వారితో సన్నిహిత్యం.

■ అలా కొంతమందికి మాత్రమే లభించే వరాలు.. అదృష్టాల వెనుక భయంకరమైన శక్తి దాగి వుంటుంది. అంతటి వరమిచ్చింది అహంతో తప్పటడుగు వెయ్యమని కాదు. అహంకారంతో ప్రవర్తించమనీ కాదు. అలా చేస్తే అంతే సంగతులు. తప్పు ఒక్కసారి చేస్తే అది రిపీట్ అవుతుంది. శౌచం లేకపోతే స్త్రీ, ధనం, కీర్తి వుండవు. రోజుకి ఎనిమిది మణుగుల బంగారాన్ని ఇచ్చే శమంతకమణి కూడా బంగారం ఇవ్వటానికి నిరాకరిస్తుంది.

## వీళ్ళని గెలవటం చాలా తేలిక

■ వందమందిని కొట్టే శక్తి వున్నా.. అపార మేధస్సుతో తిమ్మిని బొమ్మిని చేసే తెలివితేటలున్నా.. ఎంత ఉన్నత స్థానంలో ఉన్నా... ఆర్థికంగా దెబ్బకొడితే తేరుకోలేడు. అందుకే వందకి వందమంది అవతల వాళ్ళ మీద కసినీ, ద్వేషాన్నీ వాళ్ళ ఆర్థిక మూలాల మీదే కొడుతుంటారు. ఆ అవకాశాన్ని వారికి ఇవ్వకండి. నవగ్రహాలన్నీ శుభదృష్టితో చూసినా పోయిన ధనం తిరిగి రావటానికి యేళ్ళు పడుతుంది.





## మీ మీద పడే రాళ్ళని కూడా...

■ వాటినే ఉపయోగించి కోట కట్టుకోవాలి. ఎవరో ఏదో అన్నారని రాళ్ళు వేస్తున్నారని వాపోతే.. కృంగిపోతే.. పరువు, పరువంటూ ప్రాకులాడితే ఆ రాళ్ళే మిమ్మల్ని సర్వనాశనం చేస్తాయి. నిబ్బరంగా ఎదుర్కోండి. మిమ్మల్ని బాధపెట్టాలనీ, నష్టపరచాలనే ప్రతి చర్యని మీకు అనుకూలంగా చేసుకోండి. చేసిన వారు ఖంగుతినేలా మీ ఉన్నతమైన విజయానికి బాసటగా వాడండి. మీరు ధర్మంగా వున్నారని ప్రపంచమంతా ధర్మంగా వుండాలంటే ఎలా...

## కాయకి కాయ సరికాదు

■ అవతల వాళ్ళు జామకాయ ఇస్తే మీరు పుచ్చకాయ ఇవ్వరుగా. పూర్వం ఈ సూత్రాన్నే వాడుకొని సంచి బియ్యం తీసుకుని సంచి ఉప్పు ఇచ్చేవాళ్ళు...... సంచికి సంచి సరిపోతుందనుకునేవారు. ఆ చిన్న చిట్కా ద్వారా చాలాకాలం పంచభక్ష్య పరమాన్నాలు తినేవారు. అది లేని వారు ఉప్పు నంజుకునేవారు. ఇప్పుడు కాయకి కాయ సరికాదు. లెక్కకి లెక్క. వారు ఒకటి వడ్డిస్తే.. మీరు రెండు వడ్డిస్తేనే అంతటితో ఆగుతుంది. కాయకి కాయ అని మాయ చేసే వాళ్ళు ఇప్పటికీ వున్నారు. అందుకే లెక్కల్లో జాగ్రత్త.

**నవగ్రహ శాంతులకి దానాలిచ్చిన వారు నేరుగా ఇంటి గడప దాటి రాకుండా పక్కనుంచి వెళ్ళి స్నానం చేసి ప్రధాన ద్వారం దాటండి.**

## పక్కనున్న వాళ్ళు దెబ్బతింటే మీరూ తిన్నట్టే

■ తాత్కాలిక ప్రయోజనం ఆశించి పక్కనున్నవార్ని ఆర్థికంగా......... మానసికంగా దెబ్బకొడుతుంటే చూస్తూ వూరుకుంటే పోయేది వాడే కాదు, మీరు కూడా. కాకపోతే కొద్దిగా ఆలస్యం అంతే. జారిపడితే లేపేది ఎప్పుడూ పక్కనున్న వాడే. దూరంగా వున్న వాడు వినోదంగా చెప్పు కుంటాడు. కాన పక్కవాడి మంచి, చెడూ లాభనష్టాల గూర్చి ఆలోచించండి. నీ పక్కన అంతా బావుంటేనే కదా సుఖాలు. అందరూ ఏడుస్తుంటే బావుకునేదేముంది. ప్రతివాడి సమస్య మీదవుతుంది. చివరికి అందరూ సమస్యల్లోవుంటారు.

## పసుపు కొమ్ము కట్టుకుని బంగారమిచ్చినా దోషం పోదు

■ సీతామహాదేవి గూర్చి అవాకులు చవాకులు మాట్లాడి నందుకు కొంతకాలం అయోధ్యలో అరాచకం ప్రబలింది. ప్రజలు మహా వేదనలకి గురయ్యారు. దానికి ప్రతిగా రాజ్యంలో స్త్రీలు పసుపుకొమ్ము కట్టుకుని బంగారాన్నిచ్చి బంగారు సీతను చేయించి వారి దోషాలను పోగొట్టుకున్నారు. తెలిసీ తెలియక అహంతోనో......... అక్కసు తోనో......... మరో కారణంగానో మాట్లాడితే అంతే. తీరని నష్టం జరగుతుంది. మీ స్వార్థాలకీ, నీచత్వాలకీ మీ ఇంట్లో ఆడవారి మీద మీ వాగుడు మహా కాలసర్పమై కాటు వేస్తుంది.





## నల్లగా, ఛామన ఛాయతో వుంటే కుజదోషం వుండాలని లేదు

సుబ్రహ్మణ్యస్వామికి కోపం ఎక్కువ........ ఆయనకి పదకొండు మంగళవారాలు ఒంటి పూట ఉపవాసం వుండి... సుబ్రహ్మణ్యస్వామి ఆలయాన్ని సాయంత్రం పూట దర్శిస్తే పరస్త్రీని 'సోదరి' అని పిలిచే భర్త లభిస్తాడు. పైన చెప్పినట్టు రంగు తక్కువుంటే కుజదోషం వుండటంలో నిజం లేదు... జ్యోతిష్యశాస్త్రం అలా చెప్పలేదు.

## ప్రసాదాలను కొనకండి...

■ దేవాలయాల్లో దర్శనం అయ్యాక.. లడ్డు, పొంగలి.. పులిహొర.. చక్కెర పొంగలి.. ఇత్యాదివాటిని ప్రసాదంగా ఇస్తుంటారు. కొంతమంది యాభై.. వందా తీసి ఇచ్చి పెద్ద పెద్ద ఆకుల్లో మధ్యాహ్న భోజనమంత పెట్టించుకుని లాగించేస్తుంటారు. ఏం పనులండి అవి.. ఎంతోమందికి అందాల్సిన ప్రసాదం అది.

**ఒక వ్యక్తితో శత్రుత్వం ఉందని తెలిస్తే ఆ వ్యక్తి చేసే నష్టం పదిశాతమే. చుట్టూ వున్న వాళ్ళు చేసే నష్టం తొంభై శాతం. ఈ విషయం మీరు తెలుసుకునే సరికి ఆలస్యం కాకుండా చూసుకోండి. మిత్రత్వం వుంటే వందమందికి చెప్పండి. శత్రుత్వం వుంటే ఇంట్లో కూడా చెప్పద్దు.**

## కడుపు మీద కొట్టిన పాపం...

■ మానవుల పాపాలను తుడిపేసి గంగా మహా పాప భారాన్ని పొందింది........ దాన్ని పోగొట్టు కునేందుకు శ్రీమహావిష్ణువుని అర్థించగా ఆయన ఆదేశంతో కాకి రూపంలో సకల తీర్థాలలో మునుగుతూ వెళ్ళగా హంసలదీవి దగ్గర పాప భారమంతా గంగాదేవికి తొలగిపోయింది. అలాంటి హంసలదీవిలో స్నానం చేసినా సాటి మనిషి కడుపు మీద కొట్టిన పాపం పోదు. అందుకే పెద్దల అన్నది... కోపం వస్తే చెంప మీద కొట్టు.... అంతేగాని కడుపు మీద కాదు. ఆడపిల్లని చెంపమీద కొడితే కడుపు మీద కొట్టిన పాపం తగులుతుందని కూడా శాస్త్రం గట్టిగా చెబుతోంది.

## మీ ఇంటికొచ్చే వాళ్ళు అలక్ష్మిని తేవచ్చు

■ పూర్వము బైటకెళ్ళి ఇంట్లోకి వచ్చే ముందు కాళ్ళు కడుక్కుని వచ్చేవాళ్ళు. ఇతరత్రా కార్యాల సంబంధించిన వారిని కలిసినప్పుడు బైటస్నానం చేసి ఇంట్లోకి వచ్చేవాళ్ళు. తద్వారా దోషాలూ, నష్టాలు గృహంలోకి రాకూడదని. కనీసం ఆ అవకాశం లేనప్పుడు పసుపునీళ్ళు చల్లించుకొని లోపలకి రావాలి...... బంధువులూ, హితులూ బైట వూరి నుంచి వచ్చేటప్పుడు రకరకాల సమస్యలూ, దోషాలూ వున్న వారితో కలిసి ప్రయాణం చేసి వస్తారు. అలాంటప్పుడు పసుపు నీటిని చల్లి లోపలికి ఆహ్వానిస్తే.. లేదా కనీసం కాళ్ళని కడుక్కుని రమ్మంటే దరిద్ర దోషాలు వచ్చిన దారిలోనే వెనక్కి వెళ్ళి పోతాయి.





## ఎప్పుడే అవసరం వస్తుందో..

■ అందుకనే ఎవ్వరినీ నొప్పించవద్దు. పౌరుష పదజాలంతో అహంగా మాట్లాడవద్దు. అలా చేస్తే మీ కష్ట సమయంలో అందరూ అన్నీ గుర్తు తెచ్చుకుని మరీ సాధిస్తారు. రూపాయి కూడా పుట్టకుండా చేస్తారు. బ్రతక నేర్చిన తనమంటే.. అందరూ చెప్పేది వినటం.. కామ్‌గా పక్కకి వచ్చేయటం. మనం చేసిన పొరపాట్ల కంటే, మన మాటలే మన కెక్కువ నష్టాలని తెస్తాయి...... నోరు కడుపుకి చేటు తేవటమంటే అదే.

## ఇలాంటి వాళ్ళు బహు ప్రమాదం

■ ముందుగా ఓ పెద్ద చీటీ వేసి, ఆ తర్వాత మరో ముగ్గురి చేత ఆ మాటా, ఈ మాటా చెప్పి చీటిని వేయిస్తారు. మన మంచికే కదా అని ఎవ్వరైనా అనుకుంటారు. ఇందులోనే వుంది మెలిక. అలా వేయించిన వారు 'నా చీటి పాట ష్యూరిటీగా మీరు సంతకం పెట్టండి మీరు పాడుకున్నప్పుడు నేను పెడతానంటారు'. మనకి ష్యూరిటి పెడతాడు కదా అని మనం పెడతాం. హాయిగా వాళ్ళ పని అయిపోతుంది. మీ దాకా వచ్చేసరికి.... షరా మామూలే.

**పదిమందికీ మీరు చేసే మంచి తాలూకు ప్రతిఫలం ఆలస్యంగా వస్తే రావచ్చు. అదే చెడు చేస్తే చేసే లోపు, ఆలోచించే లోపు అత్యంత వేగంగా ఒక్కోసారి రెట్టింపై చేరుతుంది. చెడు చేస్తే వాడి భరతం పట్టే పని కూడా శనీశ్వరునిదే.**

## అష్టదరిద్రాల్లో అత్యంత భయంకరమైనది

■ ధనం లేకపోవటం.. అవమానం.. చేయిచాపటం ఇతాదివన్నీ మానవజీవిత సహజం. కానీ వ్యభిచారం అంత భయంకరమైన దరిద్రం ఇంకొకటి లేదు. అది స్త్రీ అయినా మగవాడు అయినా సరే. అష్టదరిద్రాలు ఆవహించేది మగ వాడికి వ్యభిచారంతోనే......... స్త్రీకి ఆపై సంపూర్ణ జీవితం భయంకరమైన దరిద్రమే. అది పగవారికి కూడా వద్దు. ఎంత భయంకరమంటే ఏ డబ్బు కోసం స్త్రీ వ్యభిచారం చేస్తుందో.. ఒక్కోసారి ఆ డబ్బు లేకుండానే నోర్మూసుకుని చేయాలి. అది ఇంకా భయంకరమైన నరకం. అ నరకానికి మించిన నరకం......... ఆ యమ లోకంలో కూడా వుండదు. కాన మామూలు సమస్యలూ, బాధల గూర్చి వదిలెయ్యండి. అవన్నీ సర్వసాధారణం. బాధపడితే పెరుగుతుంది, వదిలేస్తే ఏమీ వుండదు. దానికి కావాల్సినది ఆలోచించటం. అంతే గాని అలాంటి వాళ్ళతో ఎలాంటి స్నేహాలు పెట్టుకోకండి. ఆడది కష్టంలో వుందంటే డబ్బులున్నవాడు ఆశ పెడతాడు. లేనివాడు ఆ డబ్బు కోసం ఆమెని ఆ నరకంలోకి నెడతాడు. కాన స్త్రీలు ఎట్టి స్థితిలో అయిన వారితో తప్ప బాధలూ, కష్టాలూ మరెవరికీ చెప్పుకోకూడదు.

## వీటికిచ్చినవి దానం కింద రావు

■ యజ్ఞ యాగాదులకి ఇచ్చిన ద్రవ్యం.. వస్తువులు. అలాగే మహాత్ములకి ఇచ్చినవి దానం కింద రావు. ధర్మం కింద అనగా ధర్మరక్షణకి ఇచ్చిన వాటి కింద వస్తాయి.





## ధనం తీసుకున్నా, ఇచ్చినా..

■ ధనం తీసుకునేటప్పుడు ఎంత దగ్గరి వాళ్ళనయినా సరే పక్కనుంచకండి. మీరు తీసుకోవటం ఆలస్యం వారిలో ఒక లాంటి భావం వస్తుంది. సంవత్సరాలు తరబడి జరిగిన పాత విషయలు గుర్తు చేసి ఎంతో కొంత మీ వద్ద తీసు కుందామని ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో శత్రుత్వం కూడా రావచ్చు. డబ్బు అంతటి శక్తి కలది. అలాగే తిరిగి ఇచ్చేటప్పుడు ఎవ్వరికీ తెలీకుండా ఇవ్వండి. తీసుకున్న వారికి మీరంటే గురి ఏర్పడుతుంది.

## ధనం సమకూర్చుకున్నాకే విజయబావుటా ఎగరేయండి

■ పడిన బాధలూ..... కష్టాలూ ఎవ్వరినైనా బాధిస్తాయి. కృంగదీస్తాయి. అవి తాత్కాలికమే. శక్తి పుంజుకోవటం ఒక్కటే కాదు విజయ లక్ష్యం. ధనం కూడా సమకూర్చుకోవాలి. పాండవులు అరణ్య అజ్ఞాతవాసాలయ్యాక బలముందనే ఒక్క కారణం తోనే పోరాటానికి దిగలేదు. ఆర్థిక పరిస్థితిని చక్క దిద్దుకున్నారు. సచివుల తోటి, గురువుల తోటి, సంప్రదించి రాజ్యం సంపాదించుకున్నారు. ఆపై యుద్ధం చేశారు. అఖండ సామ్రాజ్యాన్ని పొందారు.

**విపరీతంగా మద్యం తాగే వారితో స్నేహం, సన్నిహిత్యం, వ్యాపారం వద్దు. జూదం ఆడేవారితో అసలు సంబంధమే వద్దు. అనగా స్నేహం... వివాహం లాంటివి వద్దు.**

## ఇవన్నీ ప్లస్‌లు కాదు మైనస్‌లు

■ నేరచరిత్ర గలవాళ్ళతో సన్నిహిత్యం.

■ బలహీనుల మీద ప్రతాపం చూపించి, చుట్టూ వున్న వారిని భయపెట్టడం.

■ ధనం విషయంలో ఎగ్గొట్టడం.. లేదా బెదిరించటం.

■ వాడ్ని ఇది చేశాను, వీడ్ని అది చేస్తాను అని పదే పదే చెప్పటం.

■ కన పడగానే ఉద్రేకంగా పక్క వాళ్ళ గురించి మాట్లాడటం.

■ పదిమందినీ తీసుకొచ్చి పంచాయితీ పెట్టడం.

■ అధికారంలో వున్న వాళ్ళ పేర్లు చెప్పడం.

■ వ్యసనాల వల్లా, గొడవల వల్లా తరచూ వారి పేరు వినపడటం.. ఇవన్నీ అనగా ఆ పరిచయాలన్నీ ఎక్కువ మంది ప్లస్‌గా భావిస్తారు. కానీ అవన్నీ మైనస్‌లు. డబ్బు విషయంలోనే కాదు, వ్యక్తిగతంగానూ మిమ్మల్ని ఎక్కడుంచాలో అక్కడుంచుతారు. తద్వారా జీవితాంతం మీరు అక్కడే ఆ బురదలోనే వుండిపోతారు.

## మాఘమాసంలో
## సూర్యోదయానికి ముందు స్నానం

■ ముక్కోటి దేవతలు తమ శక్తులను ఈ మాసంలో జలాల్లోనే ఉంచుతారు. సూర్యుడు భూమికి దగ్గరికి రావటం వల్ల కూడా అనగా సూర్యకిరణాలు ప్రత్యేక కోణాల్లో పడటం వల్ల సాంద్రతలో తేడా వుంటుంది. అలా పడిన కిరణాల వల్ల నీరు శక్తి వంతమవుతుంది. ఆదివారం మరింత శక్తిమయం. ఈ మాస స్నాన ఫలం కామ్య స్నానఫలం. కామ్య స్నానమంటే యజ్ఞయాగాదుల్లో పవిత్రంగా చేసేది.





## గడప ఇవతల, అవతల

■ మీకెంత ఆప్త మిత్రులైనా సరే మీ ఫ్యామిలీ మెంబర్స్ ని కలిసేటప్పుడు వారిని దూరంగా వుంచండి. తీసుకెళ్ళటం వల్ల ఆర్థికంగా, సామాజికంగా మాట్లాడే స్థితి కల్పించటం వల్ల మీరు తక్కువవుతారు. గడప వున్నది బైటవాళ్ళు ఎక్కడ వుండాలో, లోపల వాళ్ళు ఎక్కడ వుండాలో చెప్పే గీత కూడా. పెద్దలు సాంప్రదాయంతో బాటు హద్దును కూడా పెట్టారు. ఆ హద్దే గడప.

## సూర్యగ్రహ ప్రభావం

■ తన మీద తనకి నమ్మకం.. ఏ పనైనా క్షణాల్లో చేయగలమనే శక్తి, చరుకుదనం. తద్వారా సమాజంలో గౌరవం. అదే వక్ర దృష్టితో చూస్తే విపరీత ధన వ్యయం. పక్కవారి మాటలకు లోబడటం. తద్వారా సమస్యలు. అనారోగ్యం....... గోధుమలూ, బెల్లంతో చేసిన పాయసాన్ని నైవేద్యంగా పెట్టి సూర్యపూజ చేస్తే సూర్యుని వ్రక దృష్టి పోతుంది.

**మీరెంత నిజాయితీ పరులైనా, అవతల వారెంత మానవత్వం గలవారైనా ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నారని తెలిస్తే మీకు ఎప్పుడూ ఇచ్చే అప్పు కూడా ఇవ్వటానికి మీరూహించని కారణం చెబుతారు. మీ ఆర్థిక సమస్యల గూర్చి, మరో సమస్యల గూర్చి చెప్పటం వల్ల, తెలియ చేయటం వల్ల రావాల్సిన ధనం రాకపోవటమే కాక కనీస మర్యాద కూడా దక్కదు. మనకి ముక్కోటి దేవతలుంది మన బాధలు చెప్పకోవటానికే.**

## ఎన్ని పూజలు చేసినా ఫలితం ఎందుకుండదు

■ యంత్రలోపం... మంత్ర శబ్ద లోపం... ద్రవ్య లోపం.. తంత్రీ లోపం... అలా రావటం వల్లే పూజలు ఫలించటం లేదు. యంత్ర పూజా లోపం ద్వారా కష్టాలూ, మంత్ర శబ్దలోపం ద్వారా అశాంతి....... ద్రవ్య లోపం ద్వారా అప్పులు పెరగటం....... తంత్రీ శబ్ద లోపం ద్వారా అనారోగ్యం కలుగుతాయి.

## పెద్దలంటే వాళ్ళే కాదు

తండ్రి, తల్లి, బాబాయి, అక్క, అన్నయ్యలే కాదు వయసులో పెద్దవాళ్ళని ఎవర్నైనా గౌరవించాలి. ధనం లేదనీ, తక్కువ పని చేస్తున్నారనీ తక్కువగా చూస్తే పెద్దల పట్ల చేసిన అగౌరవ దోషం తగులుతుంది. వాళ్ళు బాధపడితే దేవతలు బాధపడినట్టే. మీరు చేసే పూజా, పుణ్యం ఆ రకంగా కరిగిపోతుంది.

## ఏ డబ్బులు తిరిగిరావు

■ పక్కవాడి మీద కోపంతోనూ, ద్వేషంతోనూ ఇచ్చినవి.

■ మీరిచ్చే ధనం సాటి వాని కడుపు కొడుతుందని తెలిసీ ఇచ్చిన ధనం.

■ విద్వత్తునీ, బలాన్నీ వాడుకోవచ్చని ఇచ్చిన ధనము.

■ వ్యసనపరుడని తెలిసి ఇచ్చిన ధనం.

■ స్త్రీ వ్యామోహంతో ధనం ఇచ్చినా,

■ అవతల వాళ్ళ బలహీనతలతో ఆడుకోవచ్చని ఇచ్చినా,

■ అధిక వడ్డీకి ఆశపడినా,

■ తన బలహీనతలని అవతల వాళ్ళ మీద రుద్దే ప్రయత్నంలో ఇచ్చిన ధనం కూడా తిరిగిరాదు. ఒకవేళ వచ్చినా మహా సమస్యలతోనే వస్తాయి.





## తగ్గితే మీ వాళ్ళే మిమ్మల్ని విరుచుకు తినేస్తారు

■ మీరు బాగుంటే, మీ వద్ద ధనముంటే, బలముంటే మీ చుట్టూ వున్న వాళ్ళు మీరు ఏం చేసినా సమర్థిస్తారు. గౌరవిస్తారు. ఎక్కడైనా తగ్గారో....... తేడా వచ్చిందో, మహా మంత్రవేత్త పూజ విఫలమైతే తన దుష్టశక్తులే తన మీద విరుచుకు పడ్డట్టు మీ మీద మీవారంతా విరుచుకుపడతారు.

## నవగ్రహాలకి ఏవి ప్రీతికరములు

■ శ్రీమహావిష్ణువుకి అలంకారమూ, ఈశ్వరునికి అభిషేకములు ఎలా ప్రీతికరములో నవగ్రహాలకి ధ్యానం, మంత్ర పఠనం ప్రీతికరం. అవి చేయటం వల్ల వక్రదృష్టితో చూడకుండా శుభదృష్టితో నవగ్రహాలు ఆశీర్వదిస్తాయి.

## సాష్టాంగ నమస్కారం పెట్టినా ప్రయోజనం శూన్యం

■ ఆడవాళ్ళని తన స్వార్థనీచాలకి మాటల ద్వారా వాడుకుంటే నాశనం తప్పదు. పిల్లల్ని కూడా కలిపితే సర్వనాశనం తప్పదు. సాష్టాంగ నమస్కారం చేసినా ప్రయోజనం శూన్యం. సంకల్పం చేత భూతభవిష్యత్తు చెప్పగలిగిన నిశాచర మహర్షి కూడా అట్టి వారి నమస్కారం స్వీకరించడు. క్రోసుదూరం నుంచే గ్రహించి పక్కకి తప్పుకుంటాడు.

**సంధ్య చేస్తే ఏ రోజు పాపం ఆ రోజు పోతుందని వేదం చెబుతోంది. వడ్డీల మీద బ్రతికే వాళ్ళు సంధ్య చేసినా ప్రయోజనం లేదని చెబుతోంది అదే శాస్త్రం.**

## ఈ మూడు యోగాల్లో ఏమరుపాటు వుండాలి

■ ఎవ్వరికైనా జీవితంలో ఈ మూడు యోగాలు నడుస్తాయి. యోగం.. భోగం... రోగం.... యోగంలో భోగ మెక్కువైతే రోగాలొస్తాయి. రోగ యోగంలో ఎలాగూ భక్తి వైపు వెళ్ళక తప్పదు. భోగం నడుస్తున్నప్పుడు భక్తి వైపు వెళ్ళితే రోగం రాదు.

## ఐహికమైన సుఖాల కోసం పరమాత్మను అడక్కండి

■ అందరమూ మనుషులమే. కానీ కొంతమంది కారణజన్ములు. మరికొంత మంది కామజన్ములు. ఇంకొంత మంది కర్మ జన్ములు. ఆయుష్షు కోసం అయితే కారణ జన్ములతో సహవాసం చేయండి. అపారమైన స్త్రీ వ్యామోహం వుంటే కామజన్ములతో సన్నిహిత్యం చేయండి. ఇవన్నీ ఎందుకు మన ఖర్మ ఎంతో అంతే అని అనుకునే వారు తెలియకుండానే కర్మజన్ములతో సఖ్యతగా వుంటారు.

## భార్య కోరిక తీర్చాలి

■ పూర్వం వైకుంఠంలో శ్రీమహాలక్ష్మి అలక పూనింది. దానితో శ్రీమహావిష్ణువు బ్రతిమిలాడగా శ్రీలక్ష్మి తన కోరికను బైటపెట్టింది. అందరికీ పెళ్ళిరోజు, పుట్టిన రోజులున్నాయి. నాకు లేవు. మీరేం చేస్తారో తెలీదు.. నాకు పెళ్ళిరోజు, పుట్టిన రోజు కావాలి. దాంతో శ్రీమహావిష్ణువు పాలసముద్రం నుంచి శ్రీలక్ష్మి దేవిని ఫాల్గుణ మాసంలో ఉత్తరా నక్షత్రంలో ఉద్భవించేటట్లు చేసి భార్య కోరికను తీర్చాడు. కాన భార్య కోరిక తీర్చాలి. తీర్చకపోతే అన్నం తిన్న తర్వాత తులసి చెట్టుకి నీళ్ళు పోసినంత దోషం సుమా...





## ఏదైనా అడగాల్సింది.. చెప్పాల్సింది

■ పది రోజుల తర్వాతే. శ్రీమహాభారత యుద్ధం జరిగిన తీరు గురించి ధృతరాష్ట్రుడు సంజయుడ్ని అడిగింది. చెప్పిందీ పది రోజుల తర్వాతనే. అలా చేయటం వల్ల బాధ, కోపం, ఆవేశం, అనాలోచిత నిర్ణయాలు తగ్గుతాయి. మంచి వెంటనే చెప్పండి. చెడుని ఆలస్యంగా చెప్పండి. అదీ అర్హత వుంటేనే.

## ముత్యం పెట్టుకుంటే

■ దేవాలయాల్లో, యజ్ఞ యాగాదుల్లో మంచి ముత్యాలతో కళ్యాణంలో తలంబ్రాలను స్వామి, అమ్మవార్లకు పోస్తారు. కళ్యాణం అనంతరం ఆ మత్యం తీసుకుని ధరిస్తే సమస్యలు సమసిపోతాయి. శ్రీలక్ష్మీనారాయణుల దీవెనలు సమృద్ధిగా వుంటాయి.

## కేతు గ్రహ శుభ వీక్షణ దృష్టి లేకుంటే

■ మీరో మహాకార్యాన్ని చేయటానికి పూనుకున్నారు. ఎంత పెద్దస్థాయిలో వాళ్ళు గానీ, ఎంత ధనంవున్నా, పోసినా... ఆ కార్యం విఫలమవుతుంది. లేదా సాగమే అవుతుంది. దానికి కారణం కేతుగ్రహ వీక్షణం. కాన మీ శక్తికి మించి కార్యం చేయదలచినప్పుడు కేతుగ్రహారాధన.. శాంతి హెూమం చేసి కార్యాన్ని చేయిస్తే కార్యం ఫలిస్తుంది.

**బ్రహ్మదేవుని వాహనం హంస, ఈశ్వరునికి నంది. విష్ణువుకి గరుత్మంతుడు. కుమారస్వామికి నెమలి. ఇలా ముక్కోటి దేవతలు తమ వాహనాలుగా జంతువులని చేసుకున్నది వాటిని ప్రేమించమనీ, రక్షించమని. అంతే గాని భక్షించమని కాదు.**

## సూర్యుడు ఉదయించేటప్పుడు

■ అనేక శక్తులు ఆ సమయంలో కిరణాల ద్వారా భూమిని తాకుతాయి. సూర్యోదయ సమయంలో భూమి వరకూ ప్రవాహ రూపంలో ప్రవహించే ఆ సూక్ష్మ శక్తులు ఆయుష్షును పెంచుతాయి. ఆ సమయంలో శరీరం కిరణాల వెలుగు తాకటం వల్ల శరీరం మహదానందాన్నీ, ఆరోగ్యాన్నీ పొందుతుంది....... అందుకే ఆ సమయంలో సూర్య నమస్కారాలు, యోగ.... సంధ్య.... ఇత్యాదివన్నింటినీ చేయమని పెద్దలు చెప్పి వున్నారు.

## కోపం వద్దు

■ కోపం రాక్షస స్వభావము.. కోపం వల్ల కనుగుడ్లు వ్యాకోచం చెందుతాయి. తద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసల వేగం పెరుగుతుంది. రక్తప్రసరణలో మార్పులొస్తాయి. ఎండోక్రైన్ వ్యవస్థ దెబ్బతింటుంది. దాంతో నరాలపై తీవ్ర ప్రభావము. ఫలితంగా మనసు వికలం అవుతుంది. సరైన నిర్ణయాలు తీసుకోలేము. దాంతో ధన నష్టం.

## మీకే ఆస్తులున్నా లేకపోయినా సంతకం చూసి పెట్టండి

■ ఇన్సూరెన్స్ విషయాల్లో టోటల్ కవరేజి వుందో లేదో చూడకుండా పెడితే ఒక్కోసారి పెద్ద సమస్యే రావచ్చు.

■ తీయని మాటలకి...... ష్యూరిటీలు పెడితే సమస్య ఒక్కరోజు కాదు సంవత్సరాలు పడుతుంది.

■ నిరంతరం........ ప్రతి ట్రాన్సాక్షన్‌లో మీ నుంచి ఎంతోకొంత ఎక్స్ట్రా లాభం పొందాలనే ఎవ్వరైనా చూస్తారు. ప్రతి క్షణం ధనం విషయంలో ఏమరుపాటుగా వుండాలి. చిన్నపనే కదా అని అవతల వాళ్ళ బదులు మీరు సంతకం పెడితే ఒక్కోసారి అది మీ పీకలకే చుట్టేస్తారు అవతల వారు.





## ఉదయ విధి

■ లేవగానే 'నమఃక్షితిధారమి' అని మంత్రమును చదివి దినచర్యని ప్రారంభించాలి.

■ స్నాన ప్రారంభంలో ముందు బొడ్డుపై నీళ్ళు పోసుకుని ఆపై స్నాన విధిని చేయాలి.

■ భగవంతుని కోసం చేసిన నైవేద్యాన్ని మొత్తం పెట్టాలి.. కొంత భాగం తీసి నివేదించకూడదు.

■ పండ్లు పెట్టేటప్పుడు పండినవో లేదో చూసి పెట్టాలి.

■ మీకిష్టమైనవీ, మీ వాళ్ళకి ఇష్టమైనవీ చేసి దేవునికి నివేదన చేయకూడదు.

■ చేతుల్లో పూలు పెట్టుకుని దేవునికి నమస్కరిస్తే మళ్ళీ వాటిని దేవునికి సమర్పించకుండా విష్వక్సేనుల వారికి సమర్పించాలి.

■ నైవేద్యాలకి మీ అవులింత గాలి తగలకూడదు.

## త్రిమూర్తుల గూర్చి తపస్సు చేసినవాడు శనీశ్వరుడు

■ సూర్యపుత్రుడు శనీశ్వరుడు త్రిమూర్తులను ఏక కాలంలో మెప్పించాలని చతుర్ముఖుడ్నీ, శ్రీమహావిష్ణువునీ, మహేశ్వరుడ్నీ జపిస్తూ తపస్సు చేశాడు. నాకోసం కాదు నాకోసం కాదు అని ఎవ్వరూ స్పందించలేదు. అయినా మొండిగా తపస్సు చేసి ముగ్గురినీ మెప్పించాడు. ఆ లక్షణంతోనే అవ్వని పనికి నిరాశపడకుండా పట్టుదలతో ముందుకు వెళ్తే శనీశ్వరుడి అనుగ్రహం లభిస్తుంది.

**ఆవులకి గడ్డి లేదా తోటకూర వంటివి తినిపిస్తే నలభై ఒక్క రోజుల్లో గ్రహ పీడలు తొలగిపోతాయి.**

## గరికలా నిలవండి

■ గరిక ఎండకూ, వానకు చెదరదు. ఎంత కోసినా, పీకినా మళ్ళీ మొలుస్తుంది. అందుకే చాలా దైవ కార్యాల్లో వాడతారు. గరికలా తట్టుకోవాలి. ఎన్ని ఒత్తిడులు వచ్చినా ఎన్ని సమస్యలు ఎదురైనా గరికలా పచ్చగా వుంటారు. పవిత్రమౌతారు.

## అసమర్ధతే అసలు కారణం...

■ రాయిని రాయిని రాపిడి చేసి నిప్పు తెప్పించుకునే రాతి యుగం కాదు.. భయపడటానికి. భయపడితే పోయేది సకల సుఖాలే. అన్ని అనర్ధాలకి కారణం అసమర్ధత. అనగా భయం. ఆ రెండు కలిగేది ఎదుటి వారి బలమూ, ప్రవర్తనల వల్లనే. నిజంగా అలా ప్రవర్తించే వాళ్ళే అసలు భయస్థులు. ఎదుట వాళ్ళకి భయాన్ని కలిగించే విధంగా మాట్లాడేవాళ్ళు, వాళ్ళ పబ్బం గడుపుకునే వాళ్ళు మేకవన్నె పులులే. భయపెట్టేవారికి తిరిగి పెట్టాల్సింది భయమే.

## పక్కనున్న వాడ్ని చెడగొట్టాలనుకుంటే..

■ ఆ విషయం వారికి తెలిస్తే మీ పని అయిపోయినట్టే. చాలా కూల్‌గా చేసేస్తారు. దిమ్మ తిరిగిపోతుంది. పరాయి వాడి ధనాన్నీ, భార్యనీ ఆశిస్తే కలిగే దుష్ప్రభావాలన్నీ అను భవించాల్సి వస్తుంది. అసలు పక్కనున్న వాళ్ళు బాగుపడేలా చెయ్యకపోయినా పర్వాలేదు చెడగొట్టాలనుకున్నా, వాళ్ళ బలహీనతలనూ, మంచితనాన్నీ తమకు అనుగుణంగా వాడు కోవాలని చూసినా నాశనం తప్పదు.





## అవకాశం ఎవరికి పడితే వారికివ్వకండి

■ ఓ అందమైన అద్భుతమైన సౌందర్యవతి అయిన అమ్మాయి కేవలం తన వెనుకపడుతున్నాడని అతడి ప్రేమని ఒప్పుకుంటే ఆమెకి మిగిలేది నరక జీవనం.

■ తన స్నేహితుడే కదాని అవకాశం ఇస్తే మీ విలువ తెలీకుండా దాన్ని దుర్వినియోగం చేస్తాడు. తద్వారా మీరిచ్చిన అవకాశం వృధా.

■ జీవితంలో అత్యున్నత స్థాయిని కలిగే అవకాశాన్ని మీవాడే కదాని ఇస్తే.. తద్వారా మీకెక్కడ పేరు వస్తుందోనని చెడగొడుతుంటారు. అలా ఏదైనా సరే.. మన .. మనవాడు అనుకుంటే అతడితో కలిసి హాయిగా ఎంజాయ్ చేయండి. అంతవరకే పరిమితం. మీ వృత్తి సంబంధిత, జీవిత సంబంధిత విషయాల్లోకి తెస్తే నష్టపోవటంతో పాటు, మీ ఎదుగుదల కూడా ఆలస్యం అవుతుంది.

**స్త్రీ విషయంలో తేడా వస్తే రౌద్రాన్ని కడుపులో పెట్టుకుని పైకి అమాయక మాటలతో ఏదైనా చేస్తారు. ఎన్ని గొడవలున్నా ఆడవాళ్ళను తేకండి. నర్తనశాలలో భీమసేనుడు అలాంటి లక్షణాల తోనే మాట్లాడి కీచకుడి పీచం అణుస్తాడు. కాన ఆడవాళ్ళ విషయంలో నోరు జారద్దు. ద్రౌపది చెప్పగానే భీముడు ఆవేశపడలేదు. ఆలోచించాడు. అంతే పని అయిపోయింది. అంత ప్రమాదం స్త్రీ సంబంధిత విషయం.**

## బూడిద గుమ్మడికాయను దానం ఇచ్చి...

■అనేక సందర్భాల్లో బూడిద గుమ్మడికాయను దానం ఇచ్చినప్పుడు, మరో కాయను ఇంటికి తీసుకురండి. దాన్ని మీ కుటుంబమంతా తీసుకోండి. అప్పుడే ఆ దోషం పోయి దాని తాలూకా ఫలం మీకందుతుంది. బూడిద గుమ్మడికాయను తీసుకోవటం వల్ల జ్ఞానం, తేజస్సు, ఆయుష్షు పెరుగుతాయని ఆయుర్వేద శాస్త్రం కూడా తెలవిస్తోంది.

## జీరో వరకు వెళ్ళిపోయారా...?

■అయితే మీ చుట్టు వున్న వాళ్ళని వదిలెయ్యండి. ఇవ్వాల్సిన వారికి సమయం చెప్పండి......... పగలు సూర్యుడొచ్చినట్టు, రాత్రి చంద్రుడు డ్యూటి చేసినట్టు అదే పనిగా పని చెయ్యండి. మీ చుట్టూ ఎంత ధనం సంపాదించే అవకాశం వుందో.. వానరసేన హనుమంతునికి వాని శక్తి ఏమిటో తెలియచెప్పినట్టు మీకే తెలుస్తుంది. ఏ విధమైన వ్యామోహాలూ లేకుండా.. అన్నీ వదిలేసి మీ వృత్తి మీద ధ్యాసను పెట్టండి. తిరిగి మీరు హీరోగా నిలబడటానికి ఆట్టే సమయం పట్టదు.

## కుక్క కరిస్తే తిరిగి కరుస్తామా?

■లేదు కదా.. అలాగే మీ గురించీ, మీ వాళ్ళ గురించీ అవాకులూ, చెవాకులూ పేలితే.. తిరిగి మీరూ అదే చేస్తే.. వాడికీ మీకూ తేడా వుండదు. అలాంటి వాళ్ళను దూరంగా వుంచండి. ఎవరైనా ఆ విషయాలు మాట్లాడితే అది వాడి విజ్ఞత అని తేల్చి చెప్పండి. కొంతకాలానికి మీరే స్థాయిలో వుంటారో.. అలా అన్న వాళ్ళు ఎంత నీచ స్థాయికెళ్తారో మీరే చూస్తారు.





## ఉచ్చైశ్రవం దేనితో పోటీపడదు

■ఈ దేవ లోక అశ్వము ఏ గుర్రాలతోనూ పోటీ పడదు. ఎందుకంటే దాని ప్రత్యేకత, శక్తి దేనికీ లేవు. అందుకే పోటీ పడదు. ఎవ్వరైనా మీతో పోటీ పడాలి. అంతేగాని మీరు పోటీకి దిగితే తక్కువయినట్టే. మీ మార్గంలో ఎవ్వరైనా నడుస్తుంటే వదిలేయండి. మీ మానాన మీరు ముందుకు సాగండి. అత్యున్నత శిఖరాలను చేర్చే సూత్రమదే.

## స్త్రీ పురుషులెవ్వరికైనా శీలం ప్రధానం

తీర్థాభిషేక గమనైః<br>
నిదాఘసూర్యానువర్తన స్థానైః<br>
శిశిరేష్వప్సు నివాసైః<br>
నాశీలః స్వర్గమాప్నోతి ॥

భువిపై సకల తీర్థములను సేవించినా, మహా భీకర ఎండలో సూర్యుని ఎదురుగా నిలిచి తపస్సు చేసినా, మహా చలిలో జపము చేసినా శీలం అనేది.. అనగా ధర్మ ప్రవర్తన లేకపోతే స్వర్గాన్ని అనగా సుఖాలను పొందలేడని అర్థం.

– సుందరపాండ్యుడు

**తమిళనాడులోని వైదీశ్వరన్‌కోయిల్‌లో తీర్థ ప్రసాదాలను స్వీకరించిన వారికి అనేక దీర్ఘవ్యాధుల నయమవుతాయని పురాతన కాలం నుంచి గట్టి నమ్మకం.**